రును వున గౌరవమును పాటింపకయున్న గాని కలికాలమున ద్రవ్య
అని తాత్పర్యము.

అభ్యాస్య లజ్జమానేన తత్త్వం జిజ్ఞాసునా చిరం ।
జిగీషుణా హ్రియం త్యక్త్వా కార్యః కోలాహలో మహాన్ ॥

ఒకఁడు చక్కఁగాఁ జదువుకొని విద్యలోని సారమును గ్రహిం
చాలకాలము చదివియు రానందున సిగ్గుజెందియుండును, అట్టి
తోఁజదివి గట్టివాఁడుగానున్న మఱొకని జయింపఁదలఁచినచో
గొప్ప కోలాహలముచేసి జయించ వలయునే కాని చదువుచే
తఱముగాదు.

సారనైర గ్రంథ నిర్మాణైః ప్రతిష్ఠా తావదాప్యతే ।
ఏవంచ తథ్యవ్యుత్పత్తిరాయుషోఽన్తే భవేన్నవా ॥

తా॥ ఎవఁడుగాని యొకఁడు అనేకులకు చదువు చెప్పినను, అనేక
నులను క్రొత్తగా వ్రాసినను, వానికి గొప్పకీర్తి కలుగుచున్నది.
కాలమునందు పైన చెప్పినట్లు విద్యార్థులకుఁ జదువు చెప్పుటకును,
నులు వ్రాయుటకును దగిన జ్ఞానము కలుగవలయునన్న బ్రతికియు
కాలము చదివినను మంచి జ్ఞానము కలుగునో కలుగదోయను సంది
కలుగుచున్నది. అనఁగా నీకాలము నందందఱును మిళిమిళి జ్ఞాన
గొప్పవిద్వాంసులమని విఱ్ఱవీగుచుందురు అని తాత్పర్యము.

స్తోతారః కే భవిష్యంతి మూర్ఖస్య జగతీతలే ।
న స్తౌతిచేత్స్వయంచ స్వంక దాత స్యాస్తు నిర్వృతిః ॥ 2

తా॥ ఈలోకమునందు మూర్ఖుని స్తుతించువారెవరుందురు ? ఎవరునుం డరు. అందుచే నామూర్ఖుఁడు తన్నుతానే పొగడుకొని కొంచెము సంతో షించును. అనఁగా ఆత్మస్తుతి మూర్ఖుఁడుగాని, పండితుఁడెన్నటికిని చేసికొనఁ డని తాత్పర్యము.

శ్లో॥ వాచ్యతాం సమయోఽతీతస్స్పష్టమగ్రేభవిష్యతి ।
ఇతిపారయతాం గ్రంథేకాఠిన్యం కుత్రవర్తతే ॥ ౮॥

తా॥ శిష్యుఁడు పాఠము చదువునపుడు బాగుగ తెలియక "నాకుఁదె లియలేదు. వివరముగా నింకొక్కపర్యాయము చెప్పుడు" అని గురువునడుగ "చదువుకొని పొమ్ము పొద్దయి పోయినది. అంతాముందు తెలియును" అని పాఠము చెప్పెడువారికి ఏగ్రంథము పాఠము చెప్పవలసియున్న కష్ట మేయుండదు. అనఁగా గురువు సమర్థుఁడైయైన యెడల శిష్యుని సందేహము లఁబాపి విషయమును బాగుగ బోధించునుగాని అసమర్థుఁడు అట్లు బోధింప లేక "కానిమ్ము, ముందుతెలియును" అని చెప్పును.

శ్లో॥ అగతిత్వ మతిశ్రద్ధా జ్ఞానాభాసేన తృప్తతా ।
త్రయ శ్శిష్యగుణాహ్యేతేమూర్ఖాచార్యస్యభాగ్యజాః॥

తా॥ మూర్ఖుఁడైన గురువునకు శిష్యుఁడు తటస్థింపనే తటస్థింపఁడు. అట్లు తటస్థించినను వాఁడు తెలివిగలవాఁడైన యెడల వానివిడిచి మఱొకరి చెంతఁజేరి చదువునుగాని, మూర్ఖునియొద్ద చదువఁడు. అట్లు చేయక వానియొ ద్దనే చదువు శిష్యునకు "వేరెవ్వరు చెప్పువారులేరు నీవే గతియనుట, మిక్కిలి

చదువునందాశ, జ్ఞానాభ్యాసము (మహాధ్యము)చే బాగుగా చెప్పెనని తృప్తి జెందుట" అను మూడుగుణములు మూఢగురువు పుణ్యముచేత గలుగును, అనగా చెప్పెడు వాఁడేక చదువుమీద మిక్కిలి యాశయున్న మూఢుఁడు పైనఁజెప్పిన పండితం మన్యునియొద్ద చదువునేకాని తెలివితేటలుగల శిష్యుఁడెవ్వఁడును మూర్ఖునియొద్ద చదువఁడు అని తాత్పర్యము.

శ్లో॥ యదినక్వాపి విద్యాయాం సర్వథాక్రమతే మతిః ।
మాంత్రికాస్తు భవిష్యామో యోగినో యతయోపివా॥

తా॥ ఎన్నివిధముల నెంతప్రయత్నము చేసిచూచినను ఏవిద్యలో గాని ప్రవేశములేనివారు, "మాంత్రికులము, (దయ్యాల పోతులము) యోగులము, సన్న్యాసులము" అని పేరుపెట్టుకొని తిరుగఁ బ్రయత్నింతురు. అని తాత్పర్యము.

## మాంత్రికుల విషయము

శ్లో॥ అవిలంబేన సంసిద్ధా మాంత్రికై రాప్యతేయశః ।
విలంబే కర్మబాహుల్యం విఖ్యాప్యా వాప్యతే ధనమ్ ॥

తా॥ మంత్రశాస్త్రవేత్తలు భూతప్రేతపిశాచములు పట్టుకొని బాధించువారలకు విభూతి పెట్టినను, రక్షరేకు కట్టినను, వెంటనే వారి బాధతొలఁగి వారు క్షేమముగా నుండిరేని వారలపేరు ప్రసిద్ధికివచ్చును. అందువలన వారు కావలసినంత ద్రవ్యము సంపాదింతురు. అట్లుకాక గ్రహబాధతొలఁగక పోయిన యెడల "ఇది విభూతికిని, రక్షరేకులకును పోవుగ్రహముకాదు. పూజ, పురస్కారము, జపము, హోమము, మారణ హోమము, పూర్ణాహుతి

మొదలగు కార్యములు చేయవలసి యున్నవి. వానికి ద్రవ్యము తెమ్మ''నిచెప్పి ఘంత్ర నేత్తలు ద్రవ్యము వడయుదురు. అని తాత్పర్యము.

శ్లో॥ సుఖం సుఖిషు దుఃఖంచ జీవనందుఃఖశాలిషు ।
అనుగ్రహాయతే యేషాంతే ధన్యాఃఖలు మాంత్రికాః॥

తా॥ సుఖముగా జీవనముచేయువానికి అంతకంటె మిక్కిలి సుఖము కలుగులాగునను, దుఃఖములను అనుభవించు వారలకు అంతకంటె దుఃఖము కలుగులాగునను మంత్రప్రయోగము చేయుట తటస్థించినచో మాంత్రికుల పంట పండిన దని చెప్పుటకు సందేహముండదు. అనఁగా ఎవనికిగాని సుఖదుఃఖములు పూర్వజన్మమునందు చేసియున్న పుణ్యపాపముల ననుసరించి వచ్చునుగాని మాంత్రికులుచేయు మంత్ర ప్రయోగములచే రానేరవని భావము.

శ్లో॥ యావ దజ్ఞానతో మౌన మాచారో వా విలక్షణః ।
తావన్మాహాత్మ్యరూపేణ పర్యవస్యతి మాంత్రికే॥ ౧౩॥

తా॥ మౌనముగా ముక్కుపట్టుకొని కండ్లు మూసికొని జపము చేయు చున్నట్లుండుటయును, విలక్షణమైన యాచారము గలిగి యుండుటయును అనుమాంత్రికుల తంత్రములన్నియు ఇతరులకు తెలియనంత వరకు మంత్రజ్ఞులకు మాహాత్మ్యమును కలుగఁజేయును.

## ❀ జ్యోతిషుకుల విషయము. ❀

శ్లో॥ చారా న్విచార్యదైవజ్ఞై ర్వక్తవ్యం భూభుజాంఫలమ్ ।
గ్రహచార పరిజ్ఞానంతేషా మావశ్యకంయతః ॥ ౧౪॥

తా॥ జ్యోతిష్కులకు ముఖ్యముగా సూర్యుడు మొదలగు గ్రహముల సంచారములు చక్కగా తెలియవలెను. అది తెలియకరయే రాజులకు కార్య సిద్ధి యగునో కాదో చెప్పుటకు వీలుండదు అని తాత్పర్యము.

(తాత్పర్యాంతరము) రాజులకు ఫలములఁ జెప్పఁబోవు జ్యోతిష్కుఁడు ముందుగా రాజచారుల (రాజువృత్తాంతముల నన్నిఁటినెఱిఁగి యుండువారి) యొద్దకుఁబోయి విచారించిన పిమ్మట రాజులకు ఫలముచెప్పిన కార్యము సఫలమై దైవజ్ఞునకు లాభముండును. అంతేకాని యీ కలికాలమున శాస్త్రముచక్కఁగా చదివి ఫలముల జెప్పెడువారు అపరూపము. ఫలమునందు వారంతకంటె నపరూపము. అనిభావము.

శ్లో॥ పుత్రఇత్యేవ పితరి కన్యకేత్యేవ మాతరి ।
గర్భప్రశ్నేషు కథయన్ దైవజ్ఞోవిజయీ భవేత్ ॥ ౧౫॥

తా॥ ఎవరైనను కడుపుతో నున్నపుడు ఆగర్భిణికి ఏమిబిడ్డ కలుగునని పిల్లతండ్రియడిగిన మగ బిడ్డ పుట్టును అనియును, పిల్ల తల్లి యడిగిన ఆడు బిడ్డ పుట్టుననియును చెప్పు జోస్యుఁడు జయించును. అని తాత్పర్యము.

శ్లో॥ ఆయుఃప్రశ్నే దీర్ఘమాయుః వాచ్యంమౌహూర్తి
కైర్జనైః । జీవన్తో బహుమన్యంతే మృతాః ప్రక్ష్యంతి
కం పునః ॥ ౧౬॥

తా॥ మఱియును, ఎవరైనను జోస్యుని జూచి నాకు ఆయువు ఎన్నాళ్లున్నది అని అడిగిన యెడల నీవు నూ ఱేండ్లు బ్రతుకుదువు అనిబదులు

చెప్పవలెను. అడిగినవాఁడు నూరేండ్లు బ్రతికినచో బ్రతికి నన్నిదినములు జోస్యుఁడు గట్టివాఁడు అని గౌరవించును. ఈలోపల చచ్చినయెడల ఎవర డుగుదురు? ఎవరు నడుగరని తాత్పర్యము.

శ్లో॥ సర్వంకోటి ద్వయోపేతం సర్వంకాలద్వయావధి ।
సర్వంవ్యామిశ్రమివ చ వక్తవ్యం దైవచింతకైః ॥౧౭॥

తా॥ జ్యోతిష్కులు తమ్ముప్రశ్నయడుగు వారలకు "ఫలాని కారణముచేత కార్యము నెఱవేరును, ఫలానికారణము చేతఁజూడఁగా కార్యము నెఱవేరదు. అనియును, ఈగ్రహమునుపట్టి విచారించఁగా శీఘ్రముగా సిద్ధించునని తోఁచుచున్నది. ఆగ్రహమును పట్టి చూడఁగా కొంచెము కాలయాపనమగు లాగుననున్నది అనియును, ఏఫలమును గాని అవుననియును, కాదనియు, రెండువిధములఁ జెప్పుటమంచిది అని తాత్పర్యము.

శ్లో॥ నిర్ధనానాం ధనావాప్తిం ధనినా మధికం ధనం ।
బ్రువాణా స్సర్వథాగ్రాహ్యా లోకైర్జ్యౌతిషికా జనాః

తా॥ మఱియును, దరిద్రులు జాతకమును జూపిన నీ జాతకమునకు ధనయోగమున్నదనియును, ధనికుఁడు జాతకమును చూపినను, ప్రశ్నయడిగినను, ప్రబల ధనయోగ మున్నదనియును, చెప్పునట్టి జ్యౌతిషికులను అందఱును మంచివారని చెప్పుచు వారియొద్దకే పోవుదురు అని తాత్పర్యము.

శ్లో॥ శతస్యలాభే తాంబూలం సహస్రస్యతు భోజనం ।
దైవజ్ఞానాముపాలంభో నిత్యః కార్యవిపర్యయే ॥ ౧౯

తా॥ ఈ కాలమునందు దైవజ్ఞుఁడు చెప్పిన చొప్పున నూఱు రూపాయలు లాభమువచ్చిన నొకరోజు తాంబూలమును దైవజ్ఞునకు బహుమానము చేయుదురు. వెయ్యి రూపాయలు లాభముకలిగిన ఒక దినము భోజనమునకు నిత్తురు. దైవజ్ఞుఁడు చెప్పినట్లు జరుగకున్న ప్రతిదినమును తిట్టిపోతురు. జోస్యులకు బహుమానమొక్క పర్యాయము చేసినను, కార్యసిద్ధి కాని నాడు వారి యందలి ప్రేమచే నిత్యదూషణము చేయుదురుగదా! కాలమహిమ యేమనవచ్చును ?

శ్లో॥ అపిసాగర పర్యంతా విచేతవ్యా వసుంధరా ।
దేశో హ్యత్ర త్రి మాత్రోఽపి నా స్తిదైవజ్ఞ వర్జితః ॥

తా॥ నాలుగు సముద్రముల వరకునున్న భూమినంతయును వెదకి చూడఁగా జోస్యుఁడు లేనితావు మూరెడయినను కనుపించదు. అనఁగా ఈ కలికాలమునందందఱును జోస్యులుగానే యున్నారు అని భావము.

శ్లో॥ వారాన్కేచిత్ గ్రహాన్కేచి త్కేచిదృక్షాణి జానతే ।
త్రితయంయె విజాన న్తి తేవాచస్పతయ స్స్వయమ్ ॥

తా॥ ఈకలికాలమునందు కొందఱు దైవజ్ఞులకు ఆదివారము మొదలగు వారములు తెలియును. మఱికొందఱికి సూర్యుఁడు మొదలగు తొమ్మిది గ్రహముల పేర్లు తెలియును. ఇంకఁగొందఱికి అశ్విని మొదలగు నిరువదియేడు నక్షత్రముల పేర్లు తెలియును. కొందఱికి పైవారగ్రహ నక్షత్రములు మూడును తెలియును. ఆమూడును తెలిసినవారు మేమే బృహస్పతులము సూకంటె నెవ్వరును సమర్థులు లేరని విఱ్ఱవీగుచుందురు అని తాత్పర్యము.

శ్లో॥ నైమిత్తికాః స్వప్నదృశో దేవతోపాసకా ఇతి ।
నిసర్గశత్రవ స్సృష్టా దైవజ్ఞానామమీ త్రయః ॥ ౨౨ ॥

తా॥ శకున శాస్త్రము తెలిసినవారు, స్వప్న ఫలములఁ జెప్పువారు (బుడబుక్కలవాండ్రు) సోదె చెప్పువాండ్రు అను మువ్వురును, దైవజ్ఞులకు పరమ శత్రువులుగా భగవంతునిచే నిర్మింపఁబడిరి.

## వైద్యవిషయము

శ్లో॥ స్వస్థైరసాధ్యరోగైశ్చ జంతుభిర్నాస్తి కించన ।
కాతరా దీర్ఘరోగాశ్చ భిషజాం భాగ్యహేతవః ॥ ౨౩ ॥

తా॥ దేహమునకు ఏవిధమైన జబ్బులేనివారును, ఎంత గొప్పమందిచ్చినను నయముకాని వ్యాధిగలవారును, ఉన్నయెడల వైద్యులకు లాభమేమియు నుండదు. కొంచెము జలుబుచేసిన భయపడువారును, దీర్ఘ జాడ్యముగల వారును దొరకిరేని ఈ కాలమున వైద్యులు భాగ్యవంతులు అగుదురు. అని తాత్పర్యము.

శ్లో॥ నాతిధైర్యం ప్రదాతవ్యం నాతిభీతిశ్చ రోగిణి ।
నైశ్చింత్యాన్నాదిమే దానం నైరాశ్యా దేవ నాంతిమే॥

తా॥ వ్యాధిగ్రస్తునకు వైద్యుఁడు "ఈవ్యాధి ఒక నిమిషములో పోవును. నీవు భయపడ నక్కరలేదు." అని మహాధైర్యమును కలుగఁజేయరాదు. "ఈరోగము కుదరనే కుదరదు. మిక్కిలి కష్టసాధ్యమయిన జబ్బు" అని మిక్కిలి భయపెట్టరాదు. ఏమంటే అతిధైర్యము వలన మందే

పుచ్చుకొనఁడు, పుచ్చుకొన్నను కొద్దిజబ్బని స్వల్పద్రవ్యమిచ్చును. అతిభయమును కలిగించిన కుదురని వ్యాధికి మందెందుకని వైద్యుని చెంతనే రాఁడు. రెండువిధములచేతను వైద్యునకు నష్టమువచ్చును కనుక రోగికి అధికధైర్యమును, అధిక భయమును కలుగ నీయకూడదు అని తాత్పర్యము.

శ్లో॥ భైషజ్యంతు యథాకామం పథ్యంతుకఠినంవదేత్ ।
ఆరోగ్యం వైద్యమాహాత్మ్యా దన్యథా త్వమపథ్యతః॥

తా॥ వైద్యుఁడు రోగికి మందు మాత్రము ఏదోయొకటి తనకిష్టము వచ్చినది ఇచ్చి పథ్యము మాత్రము కఠిన ముగఁ జెప్పవలెను. తొంబది తొమ్మిది వంతులు వ్యాధికుదురక పోవచ్చును. ఒకవేళ కుదిరిన వైద్యుని గట్టితనముచేతనే కుదిరిన దనవచ్చును. రోగముకుదురకున్న పథ్యము చెప్పినట్టు చేయని కారణముచే వ్యాధి కుదురలేదు కాని నాదోషమేమియు లేదని చెప్పనగును. అని తాత్పర్యము.

శ్లో॥ నిదానం రోగనామాని సామ్యాసామ్యే చికిత్సితమ్ ।
సర్వమప్యు పదేక్ష్యంతి రోగిణ స్సదనేస్త్రియః ॥౨౬॥

తా॥ ఈవ్యాధి వచ్చుటకు కారణమేమి? ఈజబ్బుపేరేమి? ఇప్పుడు దేహములో నేమిబాధ యీవ్యాధికి యుండియుండును? ఇదివరకీ రోగమునకేమి వైద్యముచేసి యున్నారు? అను విషయమును గూర్చి వైద్యుఁడే మాత్రమును యోచింప నక్కరలేకయే రోగియింటికి పోయినతోడనే వైరోగి స్థితిగతులను స్త్రీలు వైద్యునకు చెప్పెదరు. అని తాత్పర్యము.

శ్లో॥ జృంభమానేషు రోగేషు మ్రియమానేషు జంతుషు ।
రోగతత్త్వేషు శనకైర్వ్యుత్పద్యంతే చికిత్సకాః ॥

తా॥ కొందఱు వైద్యులు తాముచేయు వైద్యముచేత వ్యాధిగ్రస్తులకు వ్యాధి యధికమగు నప్పుడును, మఱికొందఱు వైద్యులు వ్యాధిగ్రస్తులు చచ్చిపోవు కాలమునందును చూచి పరిశీలించి వ్యాధి లక్షణములను కనిపెట్టి ఈజబ్బు ఫలానిది అని మెల్లమెల్లగా తెలిసికొనుచున్నారు.

శ్లో॥ ప్రవర్తనార్థ మారంభే మధ్యేత్వౌషధహేతవే ।
బహుమానార్థ మంతేచ జిహీర్షంతి చికిత్సకాః ॥ ౨౮॥

తా॥ వైద్యులు మొదట వైద్యముచేయుటకు అనియును, మధ్య మధ్య మందుచేయు నిమిత్తమనియును, కడపట బహుమాన మనియును, కఱుచకఱుచ వాయలుగా రోగులదగ్గఱ ధనములాగ యత్నింతురు అని తాత్పర్యము.

శ్లో॥ లిప్సమానేషు వైద్యేషు చిరాదాసాద్య రోగిణం ।
దాయాదాస్సంప్రరోహంతి దైవజ్ఞా మాంత్రికా అపి ॥

తా॥ ఎంతోకాలమునుండి "ఎవఁడైననొక రోగి కనిపించునా? వానియొద్ద డబ్బులాగుదుమా" అని వైద్యులు ఎదురు చూచుచుండ ఎవఁడైన నొకఁడు కనిపించిన వైద్యుని పాలిటి శత్రువులుగా మాంత్రికులును, జోస్యులును బయలుదేరి "ఇది రోగము కాదు. మందుపుచ్చుకొన నక్కఱలేదు, గ్రహాము పట్టినది, రక్షరేకుకట్టి నాల్గు దినములు విభూతి పెట్టిన నయమగును అనియును, ఇప్పుడు శనిచాలఁడు. గురువు పదునొకండింట

వచ్చిన ఈజాలకునికి మంచికాలము వచ్చుననియును, చెప్పుచు వానికూటిలో తాళ్లు వేయుదురు. అని తాత్పర్యము.

శ్లో॥ రోగస్యోపక్రమే సాన్త్వం మధ్యేకించి ద్ధనవ్యయః ।
శనైరనాదర శ్శాంతౌ స్నాతో వైద్యంన పశ్యతి॥30॥

తా॥ రోగులు రోగము వచ్చిన క్రొత్తలో వైద్యులను చూచి పొగడి మందు పుచ్చుకొనుటకు ప్రయత్నించుదురు. మందు తిన ప్రారంభించిన క్రొత్తలోకొంచెము ద్రవ్యము సెలవుచేయుదురు. వ్యాధి కొంచెము కొంచెము తగ్గుదలకు రానురాను వైద్యుని యలక్ష్యముగఁ జూచుటకు ప్రారంభించుదురు. ఆరోగ్య స్నానము చేసిన పిమ్మట వైద్యుని చూడనైన చూచునదిలేదు. అని తాత్పర్యము.

శ్లో॥ దైవజ్ఞత్వం మాంత్రికతా భైషజ్యం చాటుకౌశలం ।
ఏకైక మర్థలాభాయ ద్విత్రియోగస్తు దుర్లభః ॥ 31॥

తా॥ జోస్యము, మంత్రశాస్త్రిమునందు నేర్పు, వైద్యము, పొగడెడు నేర్పు అనునాల్గింటిలో నొకటియున్నంత మాత్రమున నే అధిక ద్రవ్యము సంపాదింపవచ్చును. వీనిలో రెండు మూఁడు విషయములు నొకని యొద్దనే యున్నచో చెప్పవలసినదే లేదు. కాని అట్లుండుట అరుదు.

శ్లో॥ అనృతంచాటు వాదశ్చధనయోగో మహా నయమ్ ।
సత్యంవైదుష్యమిత్యేష యోగోదారిద్ర్య కారకః ॥

తా॥ ఈకలికాలమునందు అసత్యము పలుకుట, ముఖస్తుతి చేయుట అను నీ రెండు విషయముల యందును నేర్పుగల వాఁడు కావలసినంత ద్రవ్యమును సంపాదింపనగును. సత్యము చెప్పువానికిని చక్కఁగా చదువుకొన్న వానికిని పూట కూటికైన గతిలేని దారిద్ర్యము కలుగును అని తాత్పర్యము.

## కవి విషయము

శ్లో॥ కాతర్యం దుర్వినీతత్వం కార్పణ్య మవివేకతామ్ ।
సర్వంమార్జంతికవయః శాలీనాం ముష్టికింకరాః ॥ 33॥

తా॥ గుప్పెడు వడ్లకే భృత్యాను భృత్యులయి యుండు కవులు ఎవఁడైన నొకఁడు ఒక రూపాయి యిచ్చిన వానియందున్న భయము. గర్వము, కృపణత (లోభము) అవివేకము. మొదలగు దుర్గుణముల నన్నిఁటి తప్పించి ఇంద్రుఁడవు చంద్రుఁడవని పొగడుచు వానిపై పద్యములఁ జెప్పుదురు అని తాత్పర్యము.

శ్లో॥ నకారణ మపేక్షంతే కవయస్తోతు ముద్యతాః ।
కించిదస్తువతాంతేషాం జిహ్వాఫుర ఫురాయతే ॥ 34॥

తా॥ స్తోత్రముచేయ మొదలుపెట్టిరేని కవులు వీని నిట్లు స్తోత్రము చేయవచ్చునా స్తోత్రముచేయ తగదా ? వీనియందుమనము వర్ణించు గుణము లున్నవా? అనికొంచెమైనను యోచింపక స్తుతింప మొదలిడుదురు. కొంచెము సేపు పొగడకున్న వారినోరు ఫురఫుర లాడుచుండును.

శ్లో॥ స్తుతంస్తువంతి కవయో నస్వతో గుణదర్శినః ।
కీటః కశ్చిదలిర్నామ కియతీ తత్రవర్ణనా ॥ 35॥

తా॥ కవులు ఒకరు వర్ణించిన విషయమునే వర్ణించుచుందురు గాని తాము ప్రత్యక్షముగా వస్తువును చూచి దాని గుణములను వర్ణింపరు. అందుకు నిదర్శనము చూడుఁడు. తుమ్మెదయనునది ఒక సామాన్యమైన పురుగు-దానిని గూర్చి ఎందఱు ఎన్నివిధముల వర్ణించిరో తిలకించుఁడు అని తాత్పర్యము.

శ్లో॥ ఏకైవ కవితా పుంసాం గ్రామాయ శ్వాయ హస్తినే।
అన్తతోఽన్నాయ వస్త్రాయ తాంబూలాయచకల్పతే॥

తా॥ కవిత్వమనునది యొక్కటే కవీశ్వరులకు గ్రామము సంపాదించుటకును, ఏనుగుఁను సంపాదించుటకును, గుఱ్ఱమును సంపాదించుటకును, చిట్టచివరకు అన్నము, వస్త్రము. తాంబూలము సంపాదించు కొనుటకు నుపయోగించుచున్నది అని తాత్పర్యము.

శ్లో॥ శబ్దాఖ్య మపరం బ్రహ్మ సందర్భేణ పరిష్కృతమ్ ।
విక్రీయతే కతిపయై ర్వృథాన్యై ర్వినియుజ్యతే ॥ ౩౭॥

తా॥ అలంకారముల చేతను, వ్యాకరణము మొదలగు వానిచేతను శుద్ధమయిన శబ్దబ్రహ్మమును పొందిన కొందఱు కవులు ఆవిద్యను వెలకిచ్చుచున్నారు. మఱికొందఱు అయోగ్యులకుఁజెప్పి పాడుచేయుచున్నారు. అని తాత్పర్యము.

శ్లో॥ వర్ణయంతి నరాభాసాన్ వాణీంలబ్ధ్వాపియే జనాః ।
లబ్ధ్వాఽపికామధేనుంతే లాంగలే వినియుంజతే॥ ౩౮॥

తా॥ పూర్వపుణ్య విశేషముచే తమకు వచ్చిన విద్యచేఁబాత్రులఁగాని యాడక నరాధములను వర్ణించువారు కోరినకోర్కెల నొసగు కామధేనువును గొంపోయి నాగలికట్టి దున్నమొదలు పెట్టువారి వంటివారు. అనఁగా గొప్ప విద్యయుండియు నయోగ్యునకుఁ గృతియిచ్చు కవిమూర్ఖుఁను అని తాత్పర్యము.

శ్లో॥ ప్రశంసన్తో నరాభాసాన్ప్రల పంతోఽన్యథాఽన్యథా ।
కథం తరంతు కవయఃకామ పా రమ్యవాదినః ॥ ౩౯॥

తా॥ లేనిపోని గుణములను ఆరోపించి నోటికి వచ్చినట్లు నరాధము లను కొనియాడువారును, కామమే యన్నిఁటికిని మేలయినదని వాదించు వారునగు కవులు ఎట్లు గట్టెక్కుదురు. అనఁగా కడతేరరని తాత్పర్యము.

శ్లో॥ యత్సందర్భే యదుల్లేఖే యద్వ్యంగ్యే నిభృతంమనః।
సమాధేరపి తజ్జ్యాయః శంకరో యదివర్ణ్యతే ॥ ౪౦॥

తా॥ కవీశ్వరులు ఏ పదసందర్భమునందుగాని, ఏయుల్లేఖమునందు గాని, వ్యంగ్యమునందుగాని మనస్సును చలింపక యుంచినట్లు శంకర గుణ వర్ణనమునందే మనసునుంచి వర్ణించిరేని యోగము నవలంబించిన వారికంటె నధికులు అని తాత్పర్యము.

## గృహస్థ విషయము.

శ్లో॥ గృహిణీ భగినీ తస్యాః శ్వశురాశ్యాల ఇత్యపి ।
ప్రాణినాంకలినా సృష్టాఃపంచ ప్రాణా ఇమేఽపరే ॥

తా॥ ఈలోకమునందు ప్రతిమనుష్యునకును బ్రహ్మనిర్మితములయిన ప్రాణవాయువులయిదుండ నవిచాలవని కలిపురుషుఁడు కలియుగమునందు భార్య, భార్యతోఁబుట్టువు, అత్త, మామ, శ్యాలకుఁడు (భార్యాతోఁబుట్టిన వాఁడు) అనునయిదు ప్రాణముల నధికముగా సృజించినాఁడు. అనఁగా పైఁ జెప్పిన యేవురును పురుషునకుఁ దనప్రాణములకంటె నధికులని తాత్పర్యము.

శ్లో॥ జామాతరో భాగినేయా మాతులా దార బాంధవాః।
అజ్ఞాతాఏవగృహిణాం భక్షయంత్యా ఖువద్గృహే॥౪౨॥

తా॥ అల్లుండ్లును మేనల్లుండ్లును మేనమామలును, ఆలివంకవారును ఎవరికిని తెలియకనే ఎలుకలాగున గృహస్థుల యిండ్లు గుల్లచేయుదురు అనితాత్పర్యము.

శ్లో॥ మాతులస్యబలం మాతా జామాతు ర్గృహితాబలం।
శ్వశురస్యబలం భార్యాస్స్వయమే వాతిథేర్బలమ్॥ ౪౩॥

తా॥ గృహస్థునింటికి అతని మేనమామ వచ్చిన యాతని భోజనమజ్జనాదుల విషయమై విచారించునది తల్లి. అల్లుడు వచ్చినయెడల కుమార్తెవిచారించును. అత్తమామలు వచ్చినయెడల భార్యవిచారించును అతిథి అభ్యాగతులు వచ్చినయెడల తాను విచారింపవలయునేకాని మఱెవ్వరును విచారింపరని తాత్పర్యము.

## అల్లుని విషయము

శ్లో॥ జామాతుర్వక్రతా తాపద్యా వచ్ఛాలస్య బాలతా।
ప్రబుధ్యమానే సారల్యం ప్రబుద్ధేఽస్మిన్ పలాయనం॥

తా॥ అల్లుఁడుచేయు వంకర పనులన్నియును శ్యాలకుఁడు (భార్య తోఁబుట్టిన వాఁడు) చిన్నవాఁడుగా నున్నంత కాలమే. అతనికి కొంచెము బుద్ధి తెలిసినకొలది అల్లుని వంకరపనులు తగ్గుచుండును. అతనికి బాగుగాబుద్ధి తెలిసి గృహ కృత్యములఁ జూచుకొనఁ బ్రారంభించిన నత్తింటనుండక అల్లుఁడు కాలికి బుద్ధి చెప్ప వలసినదే నని తాత్పర్యము.

శ్లో॥ భార్యా జ్యేష్ఠా శిశుశ్శ్యాలశ్శ్వశ్రుస్స్వాతంత్ర్యవర్తినీ ।
శ్వశురస్తు ప్రవాసీతి జామాతుర్భాగ్య ధోరణీ॥ ౭౫॥

తా॥ తనభార్య పెద్దకుమార్తెగాను, బావమరది శిశువుగను, అత్తగారు సకల కార్యములు స్వతంత్రించి చేయునదిగను, మామగారు దేశాంతరమునం దుండువాఁడుగను, తటస్థించెనేని యాయల్లునియదృష్టము చెప్పవలసినదేమున్నది? అనఁగానతఁడే మహాభాగ్యశాలియనితాత్పర్యము.

## కొమార్తె విషయము.

శ్లో॥ భూషణైర్వసనైః పాత్రైః పుత్రాణాముపలాలనైః।
సకృదాగత్య గచ్ఛన్తీ కన్యా నిర్మాష్టి మందిరమ్॥౭౬

తా॥ కుమార్తె పుట్టినయింటికి వచ్చిపోవునపుడెల్ల నగలపేరు పెట్టియు మంచి మంచి చీరెలు రవికెలు పేరుచెప్పియును, పాత్రసామాను పేరు చెప్పి యును, తనబిడ్డలకు ఆటవస్తువు లను పేరుచెప్పియును, కొంపదోచుకొనిపో వును అనితాత్పర్యము.

## భార్యావిషయము.

శ్లో॥ గృహిణీస్వజనం వక్తి శుష్కాహారం మితాశనమ్।
పతిపక్షాణాం స్తుబహ్వాశాన్ క్షీరపాం స్తస్కరానపి॥ ౪౭॥

తా॥ భార్య తనవైపువాండ్రువచ్చి యెన్నిదినము లుండి తెగతినిపోయినను. "మావాండ్లకు తినుటకే తెలియదు. ఒకవేళ భుజించినను సుకుమారభోజనము చేయుదురు" అనిచెప్పును. మగనివంక వారువచ్చి మర్యాదగా ఒకటి రెండుదినములుండి పోయినను, తిండిపోతురాములని యును, పాలు పెరుగులు తెచ్చి పొయ్యలేకయును, వండిపెట్టలేకయును నాప్రాణమువిసువుచున్నదని యును, ఏది చూచినను దాని నంతయు నిముసములో మటుమాయముచేయుదురు (దొంగలించుదురు) అనియును చెప్పును. అనితాత్పర్యము.

శ్లో॥ భార్యే ద్వే పుత్రశాలిన్యౌ భగినీ పతివర్జితా।
అశ్రాన్తకలహో నామయోగోఽయం గృహమేధినాం॥

తా॥ ఇద్దఱు భార్యలుండి వారిద్దరికిని బిడ్డలును, తలచెడ్డతోఁబుట్టువును ఉండి సదాకలహము నందు గృహస్థుల యోగమునకు మించిన దురదృష్టయోగమేదియు నుండదని తాత్పర్యము.

శ్లో॥ భార్యేద్వేబహవః పుత్రా దారిద్ర్యం రోగసంభవః।
జీర్ణౌచ మాతాపితరౌ వేకైకం నరకాధికం॥ ౪౯

తా॥ ఒక మనుష్యుఁడు ఇద్దఱు భార్యలతో సంసారము చేయుచు వారు పెట్టుకష్టముల ననుభవించుట కంటె నరకము ననుభవింపవచ్చును

అట్లుండ ఇద్దఱు భార్యలును, వారికి పెక్కండ్రు బిడ్డలును దానికి తోడు దారిద్ర్యమును, అందులో వ్యాధియును, అట్టిస్థితిలో లేవలేనిమూడుకాళ్ళ ముసలి తలిదండ్రులు నున్న గృహస్థులకు అంతకంటె నరకము వేరేయక్కర యుండదని తాత్పర్యము.

## అప్పులవాని విషయము.

శ్లో॥ స్మృతేసీదంతిగాత్రాణిదృష్టే ప్రజ్ఞా వినశ్యతి।
అహోమహదిదం భూతండుత్తమర్ణాభిశబ్దితమ్ ॥ ౫౦॥

తా॥ అప్పులవానిని తలఁచిన ఒడలంతయుఁ కంపమెత్తును, చూచిన తెలివి తప్పిపోవును (మైకమువచ్చును)। భూతమును తలఁచినను చూచినను ఈగుణములే కలుగుచున్నవి. కనుక అప్పులవానికిని భూతమునకును కలికాలమున భేదము లేదని తాత్పర్యము.

శ్లో॥ అంతకోఽపిహి జంతూనా మంతకాల మపేక్షతే ।
నకాలనియమః కశ్చిదుత్తమర్ణస్య విద్యతే ॥ ౫౧॥

తా॥ సకలజంతువులం జంపు యముఁడైనను మృత్యుకాలము సమీపించినపుడు మాత్రమే వచ్చి జనులను బాధించును కాని నిత్యమును బాధింపఁడు. అప్పిచ్చినవాఁడు అధమర్ణుని (అప్పు పుచ్చుకున్నవానిని) కాలనియమములేక యెప్పుడు పట్టిన నప్పుడే యమబాధపెట్టును అని తాత్పర్యము.

శ్లో॥ నపశ్యామో ముఖేదంష్ట్రాం నపాశం వా కరాంచలే।
ఉత్తమర్ణమవేక్ష్యైవ తథా వ్యుద్విజతే మనః ॥ ౫౨॥

తా॥ యముని కున్నట్లు అప్పుల వానికి ముఖమున భయంకరము లయినకోరలు లేవు. చేతపాశము లేదు. అయినను అప్పులవానిని (ఉత్తమర్ణుని) చూడఁగనే అప్పు పుచ్చుకొన్నవానికి మనస్సు కలతనొందును. అని తాత్పర్యము.

## దారిద్ర్య విషయము.

శ్లో॥ శత్రౌ సాంత్వం ప్రతీకారః సర్వరోగేషు భేషజం ।
మృత్యోర్మృత్యుంజయధ్యానం, దారిద్ర్యేతు నకించన॥

తా॥ శత్రువుపైకొని రాగా సామోపాయముచే తప్పించుకొననగును. ఏవిధమైన రోగమునుగాని మందుతిని మాన్పుకొనవచ్చును. మృత్యుంజయధ్యానముచేసి మృత్యువునుండి తప్పించుకొనవచ్చునుకాని. దారిద్ర్యమునుండి తప్పించుకొనుటకేయుపాయమును లేదు. అని తాత్పర్యము.

శ్లో॥ శక్తింకరోతి సంచారే శీతోష్ణేమర్షయత్యపి ॥
దీపయత్యుదరే వహ్నిందారిద్ర్యం పరమౌషధమ్ ॥

తా॥ దారిద్ర్యమను నది దేశదేశములు తిరుగుటకు శక్తినిచ్చును. ఎండకును, వానకును చలికిని సహింపఁజేయును, కడుపులో అజీర్ణ వ్యాధిలేక జఠరాగ్ని ప్రజ్వరిల్లు లాగునచేయును. కావున దారిద్ర్యమును మందనిచెప్పవచ్చును. అనఁగా, దారిద్ర్య పీడితులగు వారు తిండికి లేక దేశదేశములు తిరుగుదురు. కట్టను కప్పుకొనను బట్టలులేకయును, ఉండనిల్లును, పండమంచమునులేక యును, ఎండకు ఎండుచు వానకు తడియుచు, చలికి వణకుచునుందురు. కడుపున కన్నములేక అన్నమన్నమని యల్లాడుచుందురని తాత్పర్యము.

శ్లో॥ గిరంస్ఖలంతీం మీలన్తీం దృష్టింపాదౌ విసంస్ఫుటౌ।
ప్రోత్సాహయతియాచ్ఞాయాం రాజాజ్ఞేవ దరిద్రతా॥

తా॥ నోటమాటరాక తడఁబడుచున్నను, కండ్లుతెలుపులు పడక మూసికొనిపోవుచున్నను, అడుగులు తడబడుచున్నను, రాజాజ్ఞ వేడనెట్లుబుద్ధి పుట్టించునో యట్లైదరిద్ర దేవత దరిద్రుని యాచింపఁ బ్రోత్సాహముచేయును. అని తాత్పర్యము.

శ్లో॥ జీర్యంతి రాజవిద్వేషా జీర్యం త్యవిహతాన్యపి।
ఆకించన్య బలాఢ్యానా మంతతోఽశ్మాపి జీర్యతి ॥

తా॥ దారిద్ర్య బలముగలవారు రాజద్వేషముల జీర్ణము చేసికొనఁగలరు. చేయఁగూడని దుష్కార్యముల నొనర్చి తప్పించుకొనఁగలరు. ఇది యదియని చెప్పవలసిన దేమున్నది? ఱాలుమ్రింగియైన జీర్ణము చేసికొందురు. పైకార్యములు బలాఢ్యులుచేసి సమర్థించుకొనఁదగిన వయ్యును బలహీనులయినదరిద్రులు వానింజేయుట దారిద్ర్య బలముచేతనే నని భావము.

శ్లో॥ నాస్య చోరా న పిశునా న దాయాదా న పార్థివాః।
దైన్యంరాజ్యాదపి జ్యాయో యదితత్త్వం ప్రబుధ్యతే॥

తా॥ దారిద్ర్యమును నాకు కావలయునని దొంగిలించువారును, ఈదారిద్ర్యమునాది నేను దీనినివిడువను అను లోభులును, దారిద్ర్యమునం తనునీవే తీసికొనెదవే నాకును సగభాగమును పంచుమను దాయాదులును, ఈదారిద్ర్యమునకు నేను రాజును, నీవుకాదని తగవులాడు రాజులునులేరు. రాజ్య

మునకు అట్లు కాదు. దానిం దొంగిల దొంగలును, పరులకిచ్చుటకును తామతి నుటకు నిష్టములేని లోభులును, భాగము పంచుమను దాయాదులును, రాజ్యమునకు యుద్ధముచేయు రాజులునుగలరు. కావున చక్కఁగా యోచించి చూడ రాజ్యము కంటె దారిద్ర్యము గొప్పదని తోఁచుచున్నది. అనఁగా దారిద్ర్యము దుఃఖకరము. కనుక నేదాని నెవ్వరుకోరరని తాత్పర్యము.

## సంపద విషయము

శ్లో॥ ప్రకాశయ త్యహంకారం ప్రవర్తయతి తస్కరాన్ ।
ప్రోత్సాహయతి దాయాదాంల్లక్ష్మీః కించిదుపస్థితా॥

తా॥ మనుష్యునకు కొంచెము ఐశ్వర్యము కలిగెనేని యాయైశ్వర్యము అంతకు ముందు లోనణఁగియున్న వానియహంభావమును వెలిబుచ్చును. ఆసంపదదొంగలకు దొంగిలింప నుత్సాహమును కలిగించును. దాయాదులను ధనమునకుఁ జగడము వేయఁ బ్రోత్సాహముచేయును అని తాత్పర్యము.

శ్లో॥ విడంబయంతి యేనిత్యం విదగ్ధాన్ధనినోజనాః ।
తఏవతువిడంబ్యన్తే శ్రియాకించి దుపేక్షితాః ॥ ౫౯॥

తా॥ మేముధనికుల మని గర్వించి బీదలను మోసఁబుచ్చఁ జూచిరేని వారిని లక్ష్మితొలఁగి పోవును. అప్పుడు వారే మోసఁబుచ్చఁ బడుదురు అనితాత్పర్యము.

శ్లో॥ ప్రామాణ్యబుద్ధి స్తోత్రేషు దేవతాబుద్ధి రాత్మని।
కీటబుద్ధిర్మనుష్యేషు నూతనాయాః శ్రియఃఫలమ్॥ ౬౦॥

తా॥ మొదటి నుండియు దరిద్రులయి మధ్యభాగ్యవంతులయినేని వారికిస్తోత్రముల యందు ప్రేమయధిక ముగనుండును. తమ్ము దేవతలుగనే భావించుచుందురు. మనుష్యులను చీడపురుగులను విదిలించి కొట్టినట్లు అలక్ష్యముగఁ జూతురు ఇవన్నియు నూతన సంపద లక్షణములని తాత్పర్యము.

శ్లో॥ శృణ్వంత ఏవపృచ్ఛంతి పశ్యంతోఽపి న జానతే ।
విడంబనాని ధనికాః స్తోత్రాణీత్యేవ మన్వతే ॥ ౬౧॥

తా॥ మఱియును మనుష్యులు కొందఱువచ్చి ఒకవిషయమును చెప్పనపుడు వినుచున్నప్పటికిని తెలియనిలాగున దానినే పదిపర్యాయములు ధనికులు అడుగుదురు. ఒకవస్తువును చూచుచున్నను ఆవస్తువు ఫలానిది అని తెలియనివారై మిట్టిపడుదురు. తమ్ముమోస పుచ్చవచ్చి పలుకు పలుకుల మోసపువాక్యములుగ తెలిసికొనక స్తుతి వాక్యములని పొంగుచుందురు. అనఁగా నూతనముగా సంపదవచ్చినవాఁడు కన్నుమిన్నుగానక యదిరి పడుచుండునని తాత్పర్యము.

శ్లో॥ ఆవృత్య శ్రీమదే నాంధా నన్యోన్య కృతసంవిదః ।
స్వైరంహసంతి పార్శ్వస్థా బాలోన్మత్త పిశాచవత్ ॥

తా॥ సంపన్మదముచే నంధులయిన ధనికుల చుట్టుచేరి యిరుగుపొరుగువారుబాలురను, పిచ్చివాండ్రను, దయ్యము పట్టిన వాండ్రను, ఆడించినలాగున తమయిష్టము వచ్చినట్లు పరిహాసముచేయు దురని తాత్పర్యము.

శ్లో॥ స్తోతవ్యైస్స్తూయతే నిత్యం సేవనీయైశ్చ సేవ్యతే ।
న బిభేతి న జిహ్రేతి తథాపి ధనికో జనః ॥ ౬౩

తా॥ మఱియును పైనఁజెప్పిన ధనికుఁడు తానుస్తోత్రముచేయఁ దగిన పెద్దలు తన్నుస్తోత్రము చేయుచున్నను, తానుసేవచేయఁదగిన మహానుభావులు తన్ను సేవించుచున్నను, కొంచెమైనను జంకును గాని, సిగ్గునుగానిచెందఁ డని తాత్పర్యము.

శ్లో॥ క్షణమాత్రంగ్రహావేశో యామ మాత్రంసురామదః ।
లక్ష్మీమదస్తుమూర్ఖాణా మాదేహ మనువర్తతే॥౬౮॥

తా॥ దయ్యము పట్టెనేని క్షణకాలము దేహము తెలియకుండును. కల్లుత్రాగినయెడల జాముసేపు (మూఁడుగంటలు) ఒళ్లు తెలియకుండును. మూర్ఖులకు ఐశ్వర్యమదము ఎక్కెనేని చచ్చు నంతవరకు తగ్గదు అని తాత్పర్యము.

శ్లో॥ శ్రీర్మాసమర్థమాసం వాచేష్టిత్వావినివర్తతే ।
వికారస్తు తదారబ్ధో నిత్యం లశున గంధవత్ ॥ ౬౯॥

తా॥ ఈకలికాలము నందు మూర్ఖులకు సంపద మాసమో అర్థమాసమో యుండిపోవును. ఆనడమంత్రపు సిరివలన కలుగు దుర్గుణములు మాత్రము ఉల్లికంపులాగున సదాయుండును అని తాత్పర్యము.

శ్లో॥ కంఠేమదః కోద్రవజో హృది తాంబూలజోమదః ।
లక్ష్మీమదస్తు సర్వాంగే పుత్రదార ముఖేష్వపి ॥౭౦॥

తా॥ ఆళ్లమదము కంఠము నందుండును. (ఆరిగలు అనుధాన్యము నన్నమువండితిన్న నది గొంతులో కోరుమని బాధించు చుండును) తాంబూ-

మదము హృదయము నందును. సంపద వలనఁ గలుగు మదము సర్వావయవములయందును వ్యాపించును. అంతటితో పోక పుత్రుల ముఖములందును, భార్యముఖమునందును వ్యాపించును అని తాత్పర్యము.

శ్లో॥ యత్రాసీదస్తి వాలక్ష్మీస్తత్రోన్మాదః ప్రవర్తతాం।
కులేష్వవతరత్యేష కుష్ఠాపస్మారవత్కథమ్॥ ౬౭॥

తా॥ ఈసంపదయున్న వారలకు తప్పక మదముపట్టును. ఆమదము సంపదపోయినను వారిని విడువదు. అంతటితో పోక కుష్ఠువ్యాధి, మూర్ఛవ్యాధి, మొదలగువ్యాధులు ఎట్లు తనవంశమునందు పుట్టినవారి కందఱికి తప్పకవచ్చునో ఆలాగుననే సంపదవలన గలిగినమదము సయితము వానితోఁ బోక వాని వంశమున కంతకును వ్యాపించునని తాత్పర్యము.

శ్లో॥ అధ్యాపయన్తి శాస్త్రాణి తృణీకుర్వన్తి పండితాన్।
విస్మారయంతి జాతింస్వాంవరాటాః పంచషాంకరే॥

తా॥ అయిదారు గవ్వలు (కాసులు) చేతవచ్చెనేని సకల శాస్త్రములఁ జదివించును. పండితుల నగౌరవింపఁ జేయును. తనజాతిని సయితము తాను మఱచి పోవులాగున చేయును అని తాత్పర్యము.

శ్లో॥ బిభర్తు భృత్యాన్ధనికో దత్తాంవాదేయమర్థిషు।
యావద్యాచక సాధర్మ్యంతావల్లోకో నమృష్యతి॥

తా॥ ధనికుఁడు తన పనివాండ్ర నెందఱిని అన్నవస్త్రములిచ్చి పోషించినను పోషింపనిమ్ము. యాచకులు వచ్చి తన్నువేడగా వారివారి యోగ్య

తకు దగినట్టు తనియ నిచ్చినను తనియనీయనిమ్ము. లోకము ఆధనికుఁడు ద్రవ్య మునంతయు సెలవుచేసి ఒకరిని యాచించు వాఁడగు నంతవరకు ఓర్వదు అని తాత్పర్యము.

## సూచక (చాడీకోరు) విషయము

శ్లో॥ ధనభారోహిలోకస్య పిశునై రేవధార్యతే ।
కథంతే తం లఘూకర్తుంయతంతేఽపరథా స్వతః॥ ౭౦॥

తా॥ లోకమునందు మనుష్యుఁడు కూడఁ బెట్టియుంఁడు ధనమొక్క బరువు కొండెగాండ్రు మోయుచున్నారు. వారు మోయకపోయినచో వారంతట వారుగానే పిలువనిపేరంటమునకు బయలుదేరి ఒకరి కొకరికి జగడములు కల్పించి యాధనమును వ్యయముచేయ నెందుకు ప్రయత్నము చేయుదురు? అని

శ్లో॥ శ్రమానురూపంపిశునే కిముపక్రియతే న్నృపైః।
ద్విగుణంత్రిగుణంచైవ కృతాంతోలాలయిష్యతి ॥ ౭౧॥

తా॥ కొండెగాని శ్రమకు తగినట్లు రాజులు వానికేమి యుపకారము చేయుచున్నారు? ఏమియు చేయుటలేదు (వారి దుష్కార్యముల గన్గొని తగినట్లు శిక్షించుట లేదు) అందుచే వారు సంతసించుచున్నారు కాని ప్రస్తుతమున తప్పినను మరణానంతరము యముఁడు వడ్డీ అసలు ఫాయిదాలుచేర్చి రెండుమూడు రెట్లు మిక్కుటముగా శిక్షింపక మానఁడు అని తాత్పర్యము.

శ్లో॥ గోకర్ణే భద్రకర్ణేచ జపోదుష్కర్మ నాశనః ।
రాజకర్ణేజపస్సద్యః సర్వకర్మవినాశనః ॥ ౭౨॥

తా॥ గోకర్ణము, భద్రకర్ణము అనునవి పుణ్యక్షేత్రములు. అక్కడ ఎవఁడయినను మంత్రమును జపించిన నామంత్రసిద్ధిచే తానుచేసిన దుష్కర్మములు తొలఁగి పుణ్యమునందును. రాజుచెవి దాపునచేరి లేనిపోని చాడీలు ఎవఁడైన చెప్పిన (రాజకర్ణమునందు జపముచేసిన) ఆజపము సిద్ధించి యితరుల సర్వ కార్యములఁ జెడఁగొట్టును. అఁనగా కొండెగాడు ప్రభువుచెంతఁజేరితనకేమియు లాభము లేకున్నను, అందరిపై చాడీలుచెప్పి వారియుద్యోగములకు భంగము కలిగించును. ఆవలతాను ముప్పునందును. అని తాత్పర్యము.

శ్లో॥ నస్వార్థం కించిదిచ్ఛంతి నప్రేర్యంతేచ కేనచిత్ ।
పరార్థేషు ప్రవర్తంతేశఠాస్సంతశ్చ తుల్యవత్ ॥ 23॥

తా॥ సాధువులును (మంచివాండ్రును) చెడ్డవాండ్రును ఎప్పుడును సమానులుగా నున్నారు. ఎట్లన? సాధువులు తమకార్యముల సాధింప నిచ్ఛయింపరు. ఒకరి ప్రేరణ లేకయే పరుల కార్యములు సాధింపఁ జూచుదురు దుర్జనులును తమకార్యములయందు నెరవేర్చుకొను శక్తిలేక ప్రవర్తింపరు. ఒకరిప్రోత్సాహ మక్కరలేకయే పరుల కార్యములఁ జెడఁగొట్టఁ బ్రయత్నింతురు. కావున కార్య సాఫల్యము వేరుగానున్నను ప్రయత్నమున మాత్రము. సజ్జనదుర్జనులు సమానులు అని తాత్పర్యము.

శ్లో॥ కాలాంతరేహ్యనర్థాయ గృధ్రోగేహోపరిస్థితః ।
ఖలోగృహ సమీపస్థస్సద్యోఽనర్థాయదేహినామ్॥౨౪॥

తా॥ గద్ద యింటిపైని వాలిన ఆయింటిలో నున్నవారికి కొంతకాలమునకు కష్టములు సిద్ధించునని పెద్దలు చెప్పుదురు. దుర్మార్గుఁడు ఇంటిదాపునకు వచ్చినవెంటనే యాయింటివారికి కష్టములు వచ్చును అని తాత్పర్యము.

## లోభి విషయము

శ్లో॥ శుష్కోపవాసో ధర్మేషుభైషజ్యేషుచ లంఘనం ।
జపయజ్ఞశ్చయజ్ఞేషు రోచతే లోభశాలినామ్ ॥ ౭౫॥

తా॥ లోభగుణముగలవారు సకల ధర్మములను విని వానియన్నిటిలో శుష్కోపవాస ధర్మమే మేలయిన దని భావించెదరు. వ్యాధికెన్నో మందులుండ "లంఘనం పరమౌషధమ్" అను విషయమే మంచిదని తలంచుదురు. లోకమునందు స్వర్గాది సుఖముల ననుభవింప సాధనములగు యజ్ఞములు ఎన్నియో యుండ ద్రవ్యము సెలవుచేయ నక్కరలేని జపయజ్ఞమే మంచిదని యెంచుదురు. అనఁగా లోభులు తాముతినుటకును ఒకరికి చేతిమీదుగ ధర్మముచేయుటకును, వ్యాధివచ్చిన డబ్బుసెలవుచేసి మందుతినుటకును ఇష్టపడరు. అని తాత్పర్యము

శ్లో॥ కింవక్ష్యతీతి ధనికోయావ దుద్వజతే మనః ।
కింప్రక్ష్యతీతి లుబ్ధోఽపి తావదుద్విజతే తతః ॥ ౭౬॥

తా॥ యాచకుఁడు లోభియగు ధనికుని యొద్దకువచ్చి యాచించిన యేమనునో యని మనసులో గుంజాటనతో నుండును. లోభియగు ధనికుఁడు ఈమనుష్యుఁడు మనలనేమి యడుగుటకు వచ్చెనోయని మనమున గుంజాటనపడుచుండును అని తాత్పర్యము.

శ్లో॥ సర్వమాతిథ్య శాస్త్రార్థం సాక్షాత్కుర్వంతి లోభినః।
భిక్షాకబల మేకైకం మేహిపశ్యన్తి మేరువత్ ॥ ౭౭॥

తా॥ అతిధికి ఒక కబళము అన్నము పెట్టిన మేరుపర్వతమంత బంగారమిచ్చిన పుణ్యము అనిశాస్త్రమునందు యున్నది. లోభులు అతిధికి భోజనము పెట్టనే పెట్టరు. ఒకవేళ పెట్టిరేని అతిధితిను ప్రతికబలము (ముద్ద) నుమేరువునుగా భావించి దుఃఖించుదురు. కనుక అతిధికి పెట్టు కబలము మేరువని చెప్పు శాస్త్రార్థము లోభులకు బాగుగ తెలియును కాని మరెవరికిని తెలియదని చెప్పవచ్చును.

శ్లో॥ ధనపాలః పిశాచోహి దత్తేస్వామి న్యుపస్థితే।
ధనలుబ్ధః పిశాచస్తు నకస్మైచన దిత్సతి ॥ ౭౮॥

తా॥ ధనపాల పిశాచము, ధనలుబ్ధ పిశాచము. అని పిశాచములు రెండు. వానిలో ధనపాల పిశాచము ధనమును కాపాడి ఆధనము ననుభవింపదగినవాఁడు రాగానే యిచ్చును. ధనలుబ్ధ పిశాచము ఎవనికినీయక తాను దినక మంటి పాలుచేయును. అని తాత్పర్యము.

శ్లో॥ దాతారోర్థిభిరర్థ్యంతె దాతృభిః పున రర్థినః।
కర్తృకర్మవ్యతీ హారాదహోనిమ్నోన్నతంకియత్ ॥

తా॥ ఆహా! కలికాల మాహాత్మ్యము. దాతను (ఇచ్చువానిని) యాచకులు యాచించుదురు. కాలవశమున ఆదాత యాచకుని యాచించుచున్నాఁడు అనఁగా. కలికాలమున యాచకులు దాతలును దాతలు యాచకులుగను మారుదురు. కాలమెంత తలక్రిందు లయినదో చూడుఁడు అని తాత్పర్యము.

శ్లో॥ స్వామిన్నసతి నార్థస్య రక్షకః సంభవే దితి।
నిశ్చిత్యైవ స్వయమపి భుంక్తే లుబ్ధః కథంచన ॥ ౮౦॥

తా॥ లోభియగువాఁడు తాను చనిపోయిన ధనమును కాపాడు వారెవరుందురు అను యోచనచేసి దానిరక్షణనిమిత్తము తానుబ్రదుకఁదలఁచి, మిక్కిలి యాయాసముతో తినును. (అనఁగా నన్నముతినకయే జీవించు నదుపాయమేదియేని యున్నచో తనకడుపుకైన తినక లోభిధనమును కాపాడును) అని తాత్పర్యము

శ్లో॥ ప్రస్థాస్యమానః ప్రవిశే త్ప్రతిష్ఠేత దినేదినే।
విచిత్రానుల్లిఖేద్విఘ్నాం స్తిష్ఠాసు రతిథిశ్చిరమ్ ॥ ౮౧॥

తా॥ లోభియగువాఁడు తనకు కావలసిన వారియింటికి పోయి చాల కాలము పీటవేసికొని యుండ వాంఛ్రడు ఏయుపాయము చేతనైన వీనిని తొలఁగించు కొనఁజూచినను వీఁడు (లోభి) ప్రతిదినము ప్రయాణము చేయుచుండును. మఱల యేదోపనియున్నట్లు నిలచును. మఱికొన్ని దినములు శకునము కాలేదనియు కాలునొప్పియనియు ఏవేవో యనేకవిఘ్నములను కల్పించుకొని పొరుగింటనే పొట్టపోసికొనుచుండునని తాత్పర్యము.

## అర్థ విషయము

శ్లో॥ ప్రదీయతే విదుష్యేకం కలాదశ నటే శతమ్।
సహస్రం దాంభికే లోకేశ్రోత్రియేతు నకించన॥౮౨॥

తా॥ ఈకలికాలమునందు పండితునకు (సకలమును బాగుగఁజదివిన వానికి) ఒక రూపాయయును, కవిత్వము చెప్పువానికి పదిరూపాయలును, నాటకములు వేయువానికి నూఱు రూపాయలును, డాంభికునకు (ఏమియుఁ దెలియక అట్టహాసము చేయుఁవానికి) వేయి రూపాయలును, ఇచ్చెదురు కాని వేదముచదివి శుద్ధముగనున్న వానికి కాసులియరు సరిగదా మాతిగ్రైనఁజూడరు అని తాత్పర్యము.

శ్లో॥ ఘటకం సమ్యగారాధ్య వైరాగ్యం పరమంవహేత్ ।
తావదర్థాః ప్రసీద్ధ్యంతియావచ్చాప లమావృతమ్ ॥

తా॥ రాజునుగాని, ధనికునిగాని చూపించి పరిచయమును కలిగించువానికి ఘటకుఁడు అనిపేరు. అట్టివానిని చక్కఁగా గౌరవించి వేనోళ్లకొనియాడి ద్రవ్యము నందేమియు నాశలేనివాఁడుగా నెంతకాలముండునో అంత కాలమును ద్రవ్యమును లాగవచ్చును. అట్లుచేయక తన ధనాశను వెలిబుచ్చెనేని కార్యము చెడిపోవునని తాత్పర్యము.

శ్లో॥ ఏకత స్సర్వ శాస్త్రాణి తులసీకాష్ఠ మేకతః ।
వక్తవ్యంకించిదిత్యుక్తం వస్తుత స్తులసీపరా ॥ ౮౪॥

తా॥ ద్రవ్యము నార్జింపఁదలంపు గలవాఁడు సకలశాస్త్రములఁ జదివియైన నుండవలెను. లేదా తులసిమాలల మెడనిండధరించియైన నుండవలెను. ఈకాలమునందు శాస్త్రము చదివి సంపాదించుటకంటె తులసి మాలల వేసికొని యెక్కువ ద్రవ్యము గడింపవచ్చును. అని తాత్పర్యము.

శ్లో॥ విస్తృతంబాహటేనేదంతులస్యాః పరతాఃగుణాః।
విశ్వాసంమోహినీ విత్తదాయినీతి గుణద్వయమ్॥౧౫॥

తా॥ వైద్యశాస్త్రమునందు బాహటమను గ్రంథముగలదు. దానిని బాహటుఁడను నతఁడు వ్రాసెను. అందు తులసియందుగల గుణములు వర్ణింపఁబడియుండెను కాని, అందులో తులసి సకలజనులను మోహింపఁజేయునది యనియును, ధన వర్షమునుగురిపించునదియనియును వ్రాయమఱచెను అనఁగా జనులు తులసిమాలలఁదాల్చి యందఱినిమోసము చేయుదురు అనితాత్పర్యము.

## డాంభికవిషయము.

శ్లో॥ కౌపీనం భసితాలేపో దర్భా రుద్రాక్షమాలికా।
మౌనమేకాసికాచేతి మూర్ఖసంజీవనానిషట్॥ ౧౬॥

తా॥ గోచిదాల్చుట, దేహమంతట భస్మముబూసికొనుట, వ్రేలికి దర్భముడి పవిత్రమును పెట్టుకొనుట, రుద్రాక్షమాలలనుదాల్చుట, ఒకరితో మాట్లాడక మౌనముదాల్చుట, కదలమెదలక భగవద్ధ్యానముచేయువాని లాగుననుండుట. అను నీయాఱును మూర్ఖులబ్రతుకు దెఱువునకు లక్షణములు అని తాత్పర్యము.

శ్లో॥ నాసఃపుణ్యేషుతీర్థేషు ప్రసిద్ధశ్చమృతోగురుః।
అధ్యాపనావృత్తయశ్చకీర్తనీయా ధనార్థిభిః॥ ౧౭॥

తా॥ ధనముసంపాదింపఁ దలంపుగలపురుషుఁడు నలుగురితోఁగలసి మాట్లాడునపుడు నేను కాపురముండునది పుణ్యతీర్థములనిగాని పుణ్యక్షేత్ర

ములనిగాని చెప్పవలయును. చదువుచే జగత్ప్రసిద్ధుఁడయి ఖ్యాతినొందిన వాఁడు నాగురువు అనిచెప్పవలయును. నాయొద్ద నెందఱో వ్యాకరణాది శాస్త్రముల సంపూర్ణముగఁజదివి యున్నారనియును చెప్పవలయును అని తాత్పర్యము.

శ్లో॥ మంత్రభ్రంశేసంప్రదాయః ప్రయోగశ్చ్యుతసంస్కృతౌ
దేశధర్మ స్త్వనాచారే పృచ్ఛతాం సిద్ధముత్తరమ్॥౮౭॥

తా॥ ధనము సంపాదింపఁ దలఁపుగలవాఁడు డాంబికవేషముతో వచ్చినపుడు పరదేశమున నెవరైన తనయందు మంత్రలోపమును కనిపెట్టిన పుడు ఇది మాగురు సంప్రదాయమనియును, కర్మలోపము సంభవించినపుడు ఈ ప్రయోగ మాలాగేయని యును, అనాచారదోషము నారోపించు నపుడు మాదేశాచార మిట్లేయని యును, వెనుక ముందుయోచించు కొనక శీఘ్రముగ సమాధానము చెప్పవలయును అని తాత్పర్యము.

శ్లో॥ యథాజానంతి బహవో యథావక్ష్యంతి దాతరి।
తథాధర్మంచరేత్సర్వం నవృథాకించి దాచరేత్॥౮౮॥

తా॥ మఱియును ధనముగణింపఁ దలఁచిన డాంబికుఁడు తానుచేయు వ్రతనియమాదుల నందఱు తెలిసి కొనులాగునను, అట్లు తెలసి కొని దాతృత్వ గుణము గల మహాప్రభువులకు తనయోగ్యతను, (మాహాత్మ్యమును) చెప్పులా గునను, నడచుకొనవలయునే కాని వ్యర్థపు కార్యములఁ జేయఁగూడదని తాత్పర్యము.

॥శ్లో॥ సదాజపపటో హస్తే మధ్యే మధ్యేఽక్షిమీలనం।
సర్వం బ్రహ్మేతివాదశ్చ సద్యః ప్రత్యయ హేతవః॥

తా॥ ఎప్పుడును చేతి మీఁద జపవస్త్రమును, (జపముచేయునపుడు చేమూఁతకుఁగాను గోముఖమనునదియును) ఎవరితోనైనను మాట్లాడు నపుడు. మధ్య మధ్య కండ్లుమూసికొనుటయును, సకలము బ్రహ్మము, (బ్రహ్మకు మించినదేదియులేదు) అనువాదమును. సకలజనులు నమ్మి తమకు మహానుభావులని ద్రవ్యమిచ్చుటకు, గానుడాంబికులుచేయు మోసములు అని తాత్పర్యము.

॥శ్లో॥ ఆమధ్యాహ్నం నదీవాసః సమాజే దేవతార్చనమ్।
సతతం శుచివేషశ్చేత్యే తద్దంభస్యజీవితమ్ ॥ ౯౧॥

తా॥ మఱియును, సూర్యోదయము మొదలుకొని రెండుజాముల వరకు ఏటి గట్టున నేయుండుటయును, (స్నానముసంధ్య జపము తపము మొదలగు నవిచేయు మహాకర్మఠుఁడని యందఱు, తలఁచుటకు) నలుగురుచేరి భోజనము చేయుట।సంభవించెనేని దేవ తార్చనయు (పూజాపురస్కారము మొదలగు వానిం జేయుటయు) ఎల్లపుడును మడి కట్టు కొన్నటుల నటించుటయు వను నివి దాంభికుని బ్రదుకుఁ దెరువునకు లక్షణము లని తాత్పర్యము.

॥శ్లో॥ తావద్దీర్ఘం నిత్యకర్మ యావత్స్యాద్ద్రష్టృమేలనం।
తావత్సంక్షిప్యతేసర్వంయావద్ద్రష్టా నవిద్యతే॥ ౯౨॥

తా॥ డాంబికుఁడు తానుచేయు స్నాన సంధ్యా వందనాదులు చూచువారుండు నంతవరకు చేయుచుండునే గాని పిమ్మట నిముసమైనను చేయఁడు. చూచు వారులేకున్న నిముసములో నిత్యకర్మనుష్ఠానము ముగిసి పోవును అని తాత్పర్యము

॥శ్లో॥ ఆనందబాష్పరోమాంచౌ యస్యస్వేచ్ఛా వశంవదౌ।
కింతస్యసాధనై రన్యైః కింకరాస్సర్వ పార్థివాః॥ ౯౩॥

తా. తలఁచినపుడు ఆనంద బాష్పములు (సంతోసము వలన వచ్చు కన్నీరు) ను, మేనిపులకయును వచ్చునో వారికి ద్రవ్యము సంపాదింప వేరు సాధనముల తోనేమి యవసరము ? ఏమియు నవసరములేదు. పైరెండును స్వాధీనముగానుండువానికి సకలరాజులు, పని వాండ్రులాగున వశంవదులయి యుందురని తాత్పర్యము.

## దుర్జనవిషయము.

॥శ్లో॥ దండ్యమానా వికుర్వంతి లాల్యమానా స్తత స్తరామ్
దుర్జనానామతోన్యాయ్యందూరాదేవవిసర్జనమ్॥ ౯౪॥

తా॥ దుష్టులను శిక్షించిన యెడల శిక్షించిన వారి కపకారముచేయఁ జూచుదురు. దగ్గరఁజేర్చి లాలించిన నంతకంటె మిక్కిలి యపకారము చేయఁ జూచుదురు. కావున బుద్ధిమంతులు దుర్జనులను శిక్షింపకయు లాలింపకయుఁ దూరముగా నుంచుట న్యాయమని తాత్పర్యము.

॥శ్లో॥ అదాన మీషద్దానంచ కించిత్కోపాయదుర్ధియామ్
సంపూర్ణదానం ప్రకృతిర్వైరా మో వై రకారణం॥౧౨॥

తా॥ దుర్జనులగు మూర్ఖులకు దానము చేయక పోయినను, కొంచెము దానముచేసినను కొంచెముకోపము కలుగును. సమృద్ధిగా దానము చేసిన వారి స్వభావము ప్రకార ముందురు. (అనఁగా ఉపకారము చేయువాని కపకారము చేయుదురు.) అడిగినపుడు కొంచెము కొంచెముగ నిచ్చుచున్నవారు మానిరేని వారిమీద మహావైరము గలుగును. అనఁగా దుర్మార్గుల కిచ్చినను ఈయకున్నను కష్టమే నని తాత్పర్యము.

॥శ్లో॥ జ్యాయా నసం స్తవో దుష్టైర్నాయై సం స్తవః పునః।
అపత్యసంబంధ విధి స్త్వనర్థాయైవ కేవలమ్॥ ౧౩॥

తా॥ దుర్మార్గులతో పరిచయము లేకుండుటయే మంచిది. పరిచయము చేసితిమేని విరోధము పెరుగును కాని యంతకంటె లాభము లేదు. బిడ్డ నిచ్చుట బిడ్డను పుచ్చుకొనుట యనుసంబంధమే దుష్టులతోఁ జేసినచో అనర్థముల తడవుకొననక్కరలేదు. (అనర్థములు మూఁడు) నని తాత్పర్యము.

॥శ్లో॥ జ్ఞాతేయం జ్ఞానహీనత్వం పిశునత్వం దరిద్రతా।
మిల న్తియదిచత్వారితద్దిశేఽపి నమోనమః॥ ౧౪॥

తా॥ జ్ఞాతిత్వము (దాయతనము) తెలివిలేమి, కొండెములు చెప్పు స్వభావము, దారిద్ర్యము. అనునాల్గు దుర్గుణములునున్న పురుషునకే కాదు,

ఆపురుషుఁడున్న దిశకే పదివేల నమస్కారములు. అనఁగా పై దుర్గుణము లున్నవాని సాంగత్యము హానినితప్పక కలుగఁజేయునని తాత్పర్యము.

॥శ్లో॥ పరచ్ఛిద్రేషు హృదయం పరవార్తా సుచశ్రవః।
పరమర్మసు వాచంచ ఖలానా మసృజద్విధిః॥ ౯౮॥

తా॥ దుర్మార్గులకు పరులతప్పిదముల నెంచుటకు మనస్సును, పరులు చెప్పుకొను మాటలనువినుటకు చెవులను, పరుల రహస్యములను బయలుపరచుటకు నోటిని, బ్రహ్మ సృజించెను. అనఁగా దుర్మార్గులు పరులతప్పులనెంచుదురు. పరులు చెప్పుకొనుమాటలకు చెవు లొగ్గుదురు. పరులమర్మముల వెలిబుచ్చుదురని తాత్పర్యము.

॥శ్లో॥ విషేణ పుచ్ఛలగ్నేన వృశ్చికః ప్రాణినామివ।
కలినా దశమాంశేన సర్వః కాలోऽపి దారుణః॥ ౯౯॥

తా॥ తేలు విషముతోఁగూడిన కొండిచే సకలలోకులను భయపెట్టు లాగున ఈకలికాలము సకలజనభయంకరముగా నున్నది అని తాత్పర్యము.

॥శ్లో॥ యత్రభార్యా గిరో వేదా యత్రధర్మోऽర్థ సాధనమ్।
యత్రస్వప్రతిభా మానం తస్మైశ్రీకలయే నమః॥ ౧౦౦॥

తా॥ ఏయుగమునందు పెండ్లముచెప్పు పలుకులు వేదవాక్యము లగుచున్నవో (వేదవాక్యముల లాగున తప్పించుకొన శక్యము కాకున్నవో) ఏ యుగమునందు ధనము సంపాదించుటయే ముఖ్యధర్మముగా నున్నదో? ఏ

యుగమునందు తనకు తోఁచినదంతయు ప్రమాణముగా నుండునో? ఆ కలి యుగమునకు ఒకనమస్కారము అని తాత్పర్యము.

శ్లో॥ కామమస్తు జగత్సర్వం కాలస్యాస్య వశంవదమ్।
కాలకాలం ప్రపన్నానాంకాలః కింనఃకరిష్యతి॥౧౦౧॥

తా॥ ఈ ప్రపంచ మంతయు కలికాలమునకు లోఁబడిపోయినను పోనిమ్ము. పరమేశ్వరుని భక్తులమగు మనల నాకలికాలమేమి చేయఁగలదు? అనఁగా ఈ కలికాలము అందఱిని దుష్కార్యములయందు ప్రవేశపెట్టఁదల చినను ఈశ్వర భక్తులనేమియు చేయఁజాలదని తాత్పర్యము.

॥శ్లో॥ కవినా నీలకంఠేన కలే రేతద్విడంబనమ్।
రచితంవిదుషాంప్రీత్యై రాజాస్థానానుమోదనమ్॥౧౦౨

మహారాజ సభలకుఁ బోవుచు వచ్చుచుండు నుద్యోగులకు సంతసము కలుగులాగునను, పండితులకు సంతసము కలుగులాగునను, కలికాలమునందలి మోసములను గూర్చి "కలివిడంబనము" అను పేరుగల శతకమును నీలకంఠ దీక్షితుఁడను కవివర్యుఁడు వ్రాసెను అని తాత్పర్యము.

శ్రీమ దప్పయదీక్షితులవారి పౌత్రులగు
నీలకంఠదీక్షితులవారిచే విరచింపఁబడిన
కలివిడంబన శతకము
తాత్పర్యసమేతము
సంపూర్ణము.

——



శ్రీ ర స్తు.

శ్రీనీలకంఠదీక్షితవిరచితము.

ఆంధ్రతాత్పర్యసమేతము.

# స భా రం జ న శ త క ము



## జ్ఞానవిషయము.

శ్లో॥ షడ్దర్శనీ పరిజ్ఞానమండితైరివ పండితైః।
స్తంభైశ్చిత్రైర్వితానైశ్చ సభా కిమవభాసతే॥౧॥

తా॥ లోకమునందెన్నియోసభలున్నవి: చిత్రవిచిత్రము లయిన స్తంభములచేతను, మేలు కట్లు (చాందినీలు) మొదలగు శిల్పనైపుణ్యముల చేతను ప్రకాశించున్నవి కాని ఆఱుశాస్త్రములయందలి జ్ఞానవిశేషముచేప్రకాశించు పండితులున్నచో నెంతశోభయుండునో యంతటి శోభ పైనఁ జెప్పియున్నచిత్రములచేఁగలుగఁజాలదు. (పండితులున్నదే సభగానిపండితులు లేనిసభ సభకాఁజాలదు) అని భావము.

శ్లో॥ స న్తి సర్వవిధా మర్త్యా నసంత్యేకే విపశ్చితః।
అసూర్యేణేవ లోకేన కింతేన విషయేణ నః॥ ౩॥

తా॥ లోకమునందు మనుష్యులు ఎన్నివిధములుగానో ఉన్నారు కాని పండితులు (వస్తుతత్త్వము నెఱింగిన వారు) ముఖ్యముగాలేరు. కావున పండితులు లేనిదేశము సూర్యుఁడులేని దేశమెట్లునిరుపయోగమో అట్లే నిరుపయోగము. (సూర్యుడు లేకున్న మనుష్యాది జంగమములును, వృక్షాది స్థావరములును వృద్ధినందవు. కావున సూర్యుఁడు లేనిదేశము దుఃఖదము. వస్తు వివేచనమున్ననే ఆయావస్తువుయొక్క గుణాగుణంబుల నెఱింగి దాని మూలమున సుఖమ్ములనందనగును. కావున వస్తువివేచనము ముఖ్యము. అట్టివస్తువివేచనశక్తి పండి తునికిగలదు. కావున పండితులులేని ప్రదేశము సూర్యుఁడు లేని దేశమువలె ప్రకాశింపఁ జాలదు.

శ్లో॥ ఉద్యన్తు శతమాదిత్యా ఉద్యన్తు శతమిందవః।
నవినా విదుషాం వాక్యై ర్నశ్యత్యాభ్యంతరంతమః ॥

తా॥ అనేకులు సూర్యులు దయించినను, అనేకులు చంద్రులు ఉదయించినను, వెలు పలనుండు చీకటి పోవునే గానిలోని చీకఁటి (అజ్ఞానము) పోఁజాలదు. అది నశింపవలయునన్న పండితవాక్యములు కావలయును. అనఁగా అజ్ఞానమును తొలఁగించి జ్ఞానముకలుఁగఁజేయువారు పండితులు. కావున వారు సూర్య చంద్రుల కంటె లోకోపకారకులు అని తాత్పర్యము.

శ్లో॥ బహుభోజ్యం బహుభోద్ధవ్యం బహుధా బహువాసరాః।
బహుకల్పశతస్థాయి లబ్ధుం బహువిధం యశః॥ ౮॥

తా॥ లోకమునందు ఏమనుష్యుఁడుగాని అనేకకల్పముల కాలముంసు నదియును, అనేకవిధము లయినదియునగు కీర్తిని పొందఁగోరినచో ఎందటికి ఎన్నివిధములుగా నెన్నిదినములు బోధించినను తెలుగని జ్ఞానధనము నార్జించుట మంచిది అని భావము.

శ్లో॥ పాషాణా స్సర్వఏవై తే పద్మరాగేషు కోగుణః।
ప్రకాశః కశ్చి దత్రాస్తే పరత్ర స న విద్యతే॥ ౫౹

తా॥ లోకమునం దెన్ని విధములుగానో ఱాలున్నవి. అందులోఁ కొ రినవే పద్మరాగములు. అయినను వానియందు ప్రకాశముఉన్నందున నవియంతే ప్రశస్తములయినవి. గులకఱాలు మొదలగు వానియందా ప్రకాశములేమిచే నవి ప్రశస్తములు కాలేదు. అట్లే మనుష్యధర్మముచే నందఱు ఒకటియైనను జ్ఞానమను ప్రకాశముచేత నందఱికంటె పండితులు ప్రశస్తు లగుచున్నారు.

శ్లో॥ జాత్యంధా జాతిబధిరా జాతిమూకాశ్చతే జనాః।
సమ్యగారాధితా యై ర్నసంతో విజ్ఞానసింధవః॥ ౬

తా॥ విజ్ఞానమునకు సింధువులు అనఁగా విశేషజ్ఞానసంపన్నులగు పండితులను ఆరాధించని వారు (గౌరవింపనివారు) నేత్రములుండియు జన్మాంధులును (పుట్టుగ్రుడ్డులును) వినుటకు చెవులుండియును, పుట్టుచెవుడులును మాట్లాడుటకు నోరుండియును పుట్టుమూఁగలును, అగుచున్నారు. అనఁగా పండితుని గారవింపనివారికి కండ్లు, చెవులు. నోరు ఉండియును వ్యర్థము అని తాత్పర్యము.

శ్లో॥ అపిమానుష్యకం లబ్ధ్వాభవంతిజ్ఞానినో నయే।
పశుత్వైవ వరంతేషాం ప్రత్యవాయా ప్రవర్తనాత్ ॥౭॥

తా॥ ఈలోకమునందు మనుష్యజన్మమెత్తిన పిదప జ్ఞానము సంపాదింపనివాఁడు పశువుకంటె నీచుఁడు. ఏపాపమునందు ప్రవర్తింవని పశువులు జ్ఞానహీనతచే దుష్కార్యములయందు (పాపకార్యములయందుఁ) బ్రవర్తించు మనుష్యులకంటె శ్రేష్ఠములు అనిచెప్పవచ్చును. అనఁగా జ్ఞానహీనుఁడు పశువుకంటెఁ దక్కువ యని తాత్పర్యము.

శ్లో॥ కింపరోక్షం కిమధ్యక్షం కింలభ్యం కింనుదుర్లభం
సర్వమైంద్రియికం వస్తు సర్వం కరగతం సతామ్। ౮॥

తా॥ పండితులకు అగోచరమగువస్తు వని యును, గోచరమగువస్తువని యునులేదు. సర్వమునుప్రత్యక్షమే. మఱియును. వారికి ఇది సులభముగఁ బొందఁ దగినది, ఇది కష్టముగబొందఁ దగినది అని లేదు. సర్వముసులభలభ్యమే. సకలము నెఱింగినవారు పండితులు కావున సర్వమును వారికి హస్తగతము అని భావము.

॥శ్లో॥ స్థావరాజంగమామర్త్యబ్రాహ్మణామునయస్సురాః
శివఇత్యప్యమీ భేదాశ్చిదుత్కర్షనిబంధనాః॥ ౯॥

తా॥ స్థావరములని యును, (కదలనివి) జంగమములు (కదలునవి) అనియును, మనుష్యులు అనియును, బ్రాహ్మణులు అనియును, మునులనియును, దేవతలనియును ఈశ్వరుఁడు, విష్ణువు, బ్రహ్మ అనియును నుండుభే

దములుజ్ఞానాతిశయముచేతఁ గలుగు నిబంధనలుగాని వేఱేమియులేదు. అఃగా నజ్ఞులు తమమౌఢ్యముచేనిన్ని భేదము లఁగల్పించి మాయామోహితులగుచున్నారు గాని సత్యము నెఱుఁగఁజాలకున్నారు అనిభావము.

॥శ్లో॥ విద్యుజ్జలధరో వృష్టిశ్చంద్రార్కా సాగరాఇతి॥
సర్వమద్భుతమజ్ఞానాం జ్ఞానతాంతు నకించన॥౧౦॥

తా॥ మెఱుఁపు. మేఘము, వాన, చంద్రుఁడు, సూర్యుఁడు, సముద్రములు అనునివి యన్నియు వాని తత్వము నెఱుంగని మూఢులకు వింతలుగనుండునేకాని వస్తుతత్వము నెఱింగిన పండితులకు వింతలుగనుండవు, అనఁగాపైనఁ జెప్పినవాని నిజస్థితి పండితులకే తెలియును, పామరులు భేదజ్ఞానముగలిగి యుందురు అనిభావము.

॥శ్లో॥ తత్ర తత్రస్థితై ర్జ్ఞానకరణై రివ విగ్రహాః।
విద్వద్భిశ్శోభతే దేశస్తైర్విహీనస్త్వమంగలః॥ ౧౧॥

తా॥ దేహమునందలి యాభాగములందున్న కన్ను, ముక్కు, చెవి చర్మము, నాలుక యను జ్ఞానేంద్రియములుండుట చేతనే దేహమునకుశోభగలుగుచున్నది. అవి యన్నియు నశించెనేని యాదేహమునే పీనుఁగు అనిచెప్పుచున్నాము. దేహమునకు జ్ఞానేంద్రియములెట్లుశోభనుగలిగించుచున్నవో యట్లే దేశమునకుఁ బండితులుశోభనుదెచ్చుచున్నారు. అట్టిపండితులు లేనిదేశము శవతుల్యము (నిష్ప్రయోజనము.) అని తాత్పర్యము.

॥శ్లో॥ అమలీమస మచ్ఛేద్య మక్లేయమతి సుందరమ్।
అదేయమనతిగ్రాహ్యమహో జ్ఞానం మహాధనమ్॥౧౨

జ్ఞానము, ధనము, ఈ రెంటిలో జ్ఞానము ఎన్నిరెట్లో గొప్పది. ఏలన నఁగా? ధనమునం దనేక దోషములున్నవి. జ్ఞానమునం దవేవియు లేవు. మలినమైనదియును, ఛిద్రములు గలదియును, వెలయిచ్చికొనఁదగినదియును, ఈయఁదగినదియును, తీసికొనఁదగినదియును, ధనము. స్వచ్ఛమైనదియును, అచ్ఛిద్రమును, (సర్వవ్యాపకమును) అమూల్యమును, అతిసుందరమును, ఇతరులకు బలాత్కరించి తీసికొనశక్యము కానిదియును, తీసికొమ్మని ఘటపటాదివస్తువులలాగున నిచ్చుటకు శక్యము కానిదియును జ్ఞానము కావుననే పెద్దలుజ్ఞానముమహాధనమని చెప్పియున్నారు.

శ్లో॥ సందర్భ శక్తిహీనానాం శబ్దాభ్యాసో వృథాశ్రమః
ముగ్ధానిలబ్ధ్వా పుష్పాణి ముండితః కింకరిష్యతి ॥౧౩॥

తా॥ సందర్భశక్తి(సమయస్ఫూర్తి)అనఁగా సమయోచితజ్ఞానము లేనివారు ఎంతచదివియు,లాభము ండదు. సుందరము లయినపుష్పములఁగైకొని సన్న్యాసి యేజుట్టులో ముడువఁగలఁడు? అనఁగా బోడికి సుందరములయిన పుష్పములుండియు లాభము లేనిలాగున సమయోచిత జ్ఞానములేని వానికి ఎంత చదువున్నను లాభముండదు అనఁగా నర్థములేని చదువువలనలాభములేదు అనిభావము.

## కావ్యవిషయము.

శ్లో॥ శాస్త్రేషు దుర్గ్రహోఽప్యర్థస్స్వదతేకవిసూక్తిషు।
దృశ్యం కరగతం రత్నం దారుణం ఫణిమూర్ధని॥ ౧౪॥

తా॥ శాస్త్రములయందలివిషయము పాముపడగపైనున్న మణిలాగున గ్రహింప శక్యముకాదు. కావ్యామృతము అరచేతనున్న రత్నంబులాగున

సులభగ్రాహ్యము. అనఁగా శాస్త్రములు కష్టసాధ్యములు, కావ్యములు సులభ సాధ్యములు అని భావము,

శ్లో॥ ఆంజస్యం వ్యవహారాణాం ఆర్జవం పరమంధియామ్।
స్వాతంత్ర్యమపి తంత్రేషు సూతేకావ్యపరిశ్రమః॥౧౫॥

తా॥ కావ్యపరిశ్రమము మనుష్యునకువ్యవహారములలో చురుకుదనము, మంచియాలోచన శక్తిని, సకలతంత్రములయందు స్వాతంత్ర్యమును కలుగఁజేయును అని భావము.

శ్లో॥ సాహిత్య విద్యాహీనానాం సర్వశాస్త్రవిదామపి।
సమాజం పరిపశ్యంతి సమజం బుద్ధిశాలినః॥ ౧౬।

తా॥ సకలశాస్త్రముల కంఠస్థములుగ నభ్యసించినవారయ్యు సాహిత్యవిద్యయందు (అర్థజ్ఞానవిద్యయందు) ప్రవేశము లేనివారిని బుద్ధిమంతులు పశువులనుగ చూతురు. అనఁగా శాస్త్రజ్ఞానముతోఁ బాటు సాహిత్యజ్ఞానము నుండవలయునని భావము.

శ్లో॥ అశిక్షితానాం కావ్యేషు శాస్త్రాభ్యాసో నిరర్థకః।
కి మ స్త్యనుపనీతస్య వాజపేయాదిభి ర్మఖైః॥ ౧౭

తా॥ కావ్యముల నభ్యసించనివాని శాస్త్రములఁజదువుటనిష్ప్రయోజనము. వాజపేయము మొదలగు యజ్ఞములు ఉపనయనము అయినవాఁడు చేయఁదగినవి. ఉపనయనము కానివానికి వానితో నేమి ప్రయోజనము ప్రయోజనము లేదు. ఆలాగుననే కావ్యజ్ఞానములేని శాస్త్రాభ్యాసము వ్యర్థమ భావము.

శ్లో॥ అంధా విద్వజ్జనై ర్హీనా మూకా కవిభి రుజ్ఝితా।
బధిరా గాయకై ర్హీనా సభా భవతి భూభుజామ్॥ ౧౮॥

తా॥ పండితులు లేని రాజసభ గ్రుడ్డిది. కవీశ్వరులులేని రాజసభ మూగది. పాటకులులేని ఓనికొలువుకూటము చెవిటిది. అనఁగా పండితులును కవీశ్వరులును, పాటకులునున్న నే రాజసభ ప్రకాశించునేగాని వీరిలో నెవరు లేకున్నను కొరతగనే యుండును అని భావము.

శ్లో॥ సాహిత్యాదపి శాస్త్రాణి విశిష్టా నీతిచేన్మతిః।
తతోఽపి వేదాధ్యయనం తతోఽపి శివకీర్తనమ్॥ ౧౯॥

తా॥ కావ్యజ్ఞానముకంటె శాస్త్రజ్ఞానము గొప్పదిగదా! అట్లుండ సాహిత్యము లేని శాస్త్రాభ్యాసముమంచిది కాదని చెప్పుట సరికాదంటిరేని యనవచ్చును. కావ్యములకంటె శాస్త్రములు గొప్పవి. వానికంటె వేదాధ్యయనము మేలు. దానికంటె శివనామస్మరణము మంచిది అని భావము.

## కవి విషయము.

శ్లో॥ సంత్వశ్వాస్సంతు మాతంగా స్సంతుయోధాస్సహస్రశః-
నరేంద్రాణాం విశేషేణ న వినా కవినా యశః॥ ౨౦॥

తా॥ రాజులకు గుఱ్ఱములున్న వేలకొలఁది యుండనిమ్ము. ఏనుఁగులున్న నుండనిమ్ము. యుద్ధవీరులున్న వేలకొలఁది యుండనిమ్ము. అశ్వములు మాతంగములు యోధులు మొదలుగాగలవారెందఱున్నను కవీశ్వరుఁడున్ననే కీర్తి కలుగునో అది రానేరదు. అనఁగా రాజులకీర్తి కవులమూలముగ వెల్లడియగునుకాని మఱి దేనిమూలముగను ప్రకాశింపదని భావము.

శ్లో॥ కాణాఃకమలపత్రాక్షాః కదర్యాః కల్పశాఖినః।
కాతరా విక్రమాదిత్యాః కవిదృగ్గోచరంగతాః॥ ౨౧॥

తా॥ కవీశ్వరుని కంటఁబడిన యొంటికంటివారందఱు తామరరే కులవంటి నేత్రములుగల వారును, మహాలోభులు కల్పవృక్షములును (కోరిన కోరికల నిచ్చువారును) పిరికిపందలు విక్రమాదిత్యులును (విక్రమార్కునిలెన మహాశూరులును (లేక) విక్రమమున సూర్యులును) అగుచున్నారు. కవులు తమ కవిత్వనైపుణ్యమున గుణహీనుల సయితము గుణవంతులఁ జేయఁదురు. అట్టివిషయములో గుణవంతులవిషయమై చెప్పవలసిన దేమున్నది?

శ్లో॥ పారదేశ్యం వృథాదాస్యం పంచానా మేకదారతా।
పాండవానా మభూత్కీర్త్యై పారాశర్యకవేర్గిరా॥ ౨౨॥

తా॥ పరదేశమునందు వాసముచేయుట, రాజ్యపాలనార్హులు అన్యాయముగా నొకరికి సేవ చేయుట, ఒక స్త్రీని నైదుగురు వివాహము చేసికొనుట, మొదలగునవి సర్వసాధారణముగ దోషములని తెలియుచున్నను అవే వేదవ్యాసమూలముగ పాండవులకుఁ గీర్తిని గలుగఁజేసినవి. అనఁగా కవులుండి కావ్యముల రచింపకున్న పూర్వుల చరిత్రలు మనకుఁ తెలియక తెలియఁజాలవు. ఒకవేళ తెలిసినను నిజస్థితి మాత్రము తెలిసియుండదు. కావున గీర్తిపరులు కవులఁ జేర్చుకొనవలయును.

శ్లో॥ జానాతేయన్నచంద్రార్కౌ జానతే యన్నయోగినః।
జానీతేయన్నభర్గో౽పి తజ్జానాతి కవి స్స్వయమ్॥ ౨౩॥

తా॥ సూర్యచంద్రులకును, యోగులకును, పరమశివునకును, సర్వజ్ఞులు (సర్వము నెఱింగిన వారు) అనిపేరున్నది కాని వారికి సయితము తెలియని విషయమును కవియైనవాఁడు స్వయముగా తెలిసికొనుచున్నాఁడు.

శ్లో॥ సర్వాసా మపి విద్యానాం సాహిత్యంహి కవేఃపదమ్ ।
సాధారణ్యేఽపియత్త్రైవ సారస్వతపదం ధ్రువమ్॥ ౨౪

తా॥ లోకమునందు పదునాల్గు విద్యలును, అరువదినాల్గు కలలు నున్నవి. వానియన్నిఁటిలో కవికి బలకర మైనది సాహిత్యము. (విషయమును గ్రహించుశక్తి.) కనుకనే సారస్వతపదము సర్వవిద్యలను తెలుపునదియైనను, ముఖ్యముగా సాహిత్యము అనునర్థమునందే యుపయోగింపఁ బడుచున్నది.

## దాక్షిణ్యము

శ్లో॥ నాదాతవ్యం న దాతవ్యం న కర్తవ్యంన కించన ।
సాంత్వమేకం ప్రయోక్తవ్యం సర్వంతస్యవశే జగత్ ॥

తా॥ ఎవరుగాని యెల్లవారు తనకు స్వాధీనులుగ నుండవలయునని తలఁచిరేని యేదియు నెవరికి నీయనక్కరలేదు. ఎవరినుండియు నేమియు తీసికొననక్కరలేదు. మఱేమి చేయవలయునంటిరేని అందఱియందును దాక్షిణ్యముంచినఁ జాలును. అనఁగా సర్వజనవశ్యమునకు సాధనము దాక్షిణ్యమునకు మించినదేదియును లేదనిభావము.

శ్లో॥ నామరూపాత్మకం విశ్వం దృశ్యతే యదిదం ద్విధా ।
తత్రాద్యస్య కవి ర్వేధా ద్వితీయస్య చతుర్ముఖః॥ ౨౬

తా॥ మనకుఁ గనుపించునట్టిది సర్వము నామము (పేరు) రూపము (ఆకారము) అనువానిచే రెండువిధములుగనున్నది. ఆ రెంటిలో మొదటిదైననామమునుసృష్టించిన వాఁడుకవి. రెండవదియైన రూపమును సృష్టించినవాఁడు బ్రహ్మ. అనఁగా సర్వమునకు బ్రహ్మరూపమునుమాత్రము కలుగఁజేసెను. వానికన్నిఁటికిని పేరుపెట్టినవాఁడు కవి అని యభిప్రాయము.

శ్లో॥ అగ్నిష్టోమే కి ముక్థ్యే కిం కి మాజ్యే కిం రథంతరే ।
స్తుతి రిత్యేవ హృష్యంతి సర్వజ్ఞా అపి దేవతాః ॥ ౨౭॥

తా॥ అగ్నిష్టోమము (వసంతకాలమునందు అయిదు దినములలోఁ జేసి ముగించుయాగము) నందు ఏమియులేదు. * ఉక్థ్యముఅను యాగమునందును ఏమియులేదు. ఆజ్యమునందును (ప్రాతస్సవన స్తోత్రమునందును, లేక ఆజ్య శస్త్రిమునందును) ఏమియులేదు. రథంతరమునందును, (మాధ్యందిన (సవన) పృష్టమునందును) ఏమియులేదు. ఏలాభములేదు. అనఁగా అగ్నిష్టోమము మొదలగువానిం జేయుటంజేసి దేవతలు సంతసించుటలేదు. సర్వజ్ఞులయ్యును స్తోత్రములకే సంతసించుచున్నారు. సర్వము నెఱింగిన దేవతలే స్తుతిప్రియులయి యుండ కించిజ్ఞులయిన మర్త్యులవిషయమై చెప్పవలసిన విషయమేమున్నది? లోకమంతయు సామవాక్యములకు లోనైయున్నదని భావము.

* ఈశ్లోకమునందలి ఉక్థ్యము, ఆజ్యము, రథంతరము అనువానిం గూర్చి సవిస్తరంబుగ నెఱుంగఁదలంపుగలవారు ఛాందోగ్యోపనిషత్తున నెఱుంగనగును.

శ్లో॥ న జాతిరూపకర్మాణి దృశ్యంతే మృదుభాషిణి ।
పక్షిణోమలినా స్తత్ర పరపుష్టా నిదర్శనమ్ ॥ ౨౮॥

తా॥ మార్దవముగమాట్లాడువానియందు (మోమోటపుపలుకులు పలుకు వానియందు) జాతినిగాని, రూపమునుగాని, నడవడినిగాని, పాటింపరు. అందుకుదృష్టాంతము చూడుఁడు. కోవెల పక్షిజాతిలోఁ జేరినది. రూపమా కాఱు నలుపు. అట్లున్నను మధురములయిన పలుకులంబట్టి యందఱు దాని వేనోళ్లఁ గొనియాడుదురు.

శ్లో॥ అర్థహీనోఽపి మధుర శ్శబ్దో లోకప్రియంకరః ।
వీణావేణుమృదంగాదీ న్యత్రోదాహరణాని నః॥ ౨౯॥

తా॥ అర్థహీనమయ్యును విననింపగు పలుకు లోకులకు ప్రేమకలిగించును. అందుకు దృష్టాంతము. ప్రతినిత్యము మనముప్రేమించు వీణెయు, పిల్లనగ్రోవియు, మద్దెల మొదలగున వెన్నియో యున్నవి. అవి జాతిరూపాదులచే నెట్లున్నను శ్రావ్యమైనపలుకు పలుకుటచేత నే గదా వానియందు మన కెంతో ప్రేమయున్నది. కావున సాంత్వము మంచిదని భావము.

శ్లో॥ జిఘాంసంతోఽపి పశవో రుదంతోఽపి స్తనంధయాః ।
ఘ్నంతోఽపి రిపవోయుద్ధే వశమాయాంతి సాంత్వతః॥

తా॥ సాంత్వమునందు వశీకరణశక్తి యధికముగఁగలదు. కనుకనే పొడిచిచంపఁదలఁచుకొన్న పశువులును, ఏడ్చి మారాముచేయుచున్న పసిబిడ్డలును, రణరంగమునందుఁ జంపఁదలకొన్న శత్రువులును, సాంత్వవచనముల లొంగిపోవుచున్నారు అని భావము.

## దానము

శ్లో॥ దాతుః ప్రతిగ్రహీతుశ్చ యాహస్తా వుత్తరాధరౌ।
తయోరవశ్యోత్తరాధర్యం తాభ్యామేవోపపద్యతే॥ 30॥

తా॥ ఇచ్చువానియొక్కయు, పుచ్చుకొనువానియొక్కయు హస్తములే వారియొక్క యెచ్చుతక్కువలఁ దెలియఁజేయును. అనఁగా ఇచ్చువానిచెయ్యి సదా పైనయుండును. పుచ్చుకొనువానిచెయ్యి సదా క్రిందయుండును. కావున దాతగొప్పవాఁడు అని తాత్పర్యము.

శ్లో॥ అమర్త్యాస్సంతుమర్త్యావా చేతనాస్సంత్వచేతనాః ।
దానమేవపురస్కృత్య స్తూయంతేభువనైస్త్రిభిః॥ 32॥

తా॥ మనుష్యులుగాని, దేవతలుగాని, చేతనములుగాని అచేతనములుగాని దానమునను సరించియే ముల్లోకములచేఁగొనియాడఁబడుచున్నారు. అనఁగా దాతృత్వముచేతనే దాతనెల్లరును సదాకొనియాడుదురు అని తాత్పర్యము.

శ్లో॥ దేయద్రవ్యమియత్తావా దానోత్కర్షే న కారణమ్ ।
కింత్వవచ్ఛేదరాహిత్యం ధనదాంబుదయోరివ ॥ 33॥

తా॥ దానాతిశయమునకు ఇచ్చునట్టిద్రవ్యముయొక్క మితమునుబట్టి కారణముకాదు. అనఁగా ఇచ్చునట్టిద్రవ్యముకొలఁది దానాతిశయము కలుగును. కుబేరుఁడు ధనమునిచ్చువాఁడైనను నీటినొసంగు మేఘునితో సమానుఁడు కానేరఁడు గదా?

శ్లో॥ దదాతి నాదదాతి శ్చద్వా వేత్తా పరమాద్భుతా ।
యయోస్సాన్వామ్యంచ దాస్యంచలీలామాత్రవిజృంభితమ్॥

తా॥ ఇచ్చువాఁడు పుచ్చుకొనువాఁడు అనునీరెండును మిక్కిలివిచిత్రములయిన విషయములే. ఇచ్చువాఁడు గొప్పవాఁడు. పుచ్చుకొనువాఁడు తక్కువవాఁడు అని అనుకొనుట వేడుకమాటలేగాని ఇందులో ప్రభుత్వమెవరికి? దాసత్వమెవరికి? ఎవరికినేమియులేదు. కాని ఇచ్చువాఁడు పుచ్చుకొనువాఁడు అనునదిమాత్రము విచిత్రముగానున్నది.

శ్లో॥ దోషా అపి గుణాయాంతే దాతారంసముపాశ్రితః ।
కాలిమానం కిలాలంబ్య కాలమేఘఇతి స్తుతిః॥ ౩౭॥

తా॥ లోకమందెవఁడైనను దుర్గుణములుగలిగి యున్నను దాతృత్వగుము (ఇచ్చునట్టిగొనము) ఒకటియున్నయెడల వానిదుర్గుణములనన్నిఁటిని సుగుణములుగ స్తుతిచేయుదురు. కనుకనే మేఘుఁడుబొగ్గలాగునకాళె(మురికి) పట్టియున్నను "కాలమేఘుఁడు కాలమేఘుఁడని" యందఱు స్తోత్రముచేయుచున్నారు.

శ్లో॥ కిందాతు రఖిలైర్దోషైః కిం లుబ్ధస్యాఖిలైర్గుణైః
నలోభా దధికోదోషఃన దానా దధికోగుణః ॥ ౩౮॥

తా॥ దాతయందు ఎన్నిదుర్గుణములున్నను బయలుపడవు. (అనఁగా వానినెవరును చెప్పుకొనరు.) లోభియందు ఎన్నిసుగుణములున్నను బయలుపడవు. (లోభివాని సుగుణముల నెవ్వరును కొనియాడరు.) కావున లోకము

నందు లోభముకంటె చెడ్డగుణమును, దానముకంటె మించినమంచిగుణమును లేదని భావము.



శ్లో॥ అర్థా స్సాధారణా ఏవ వియుజ్యన్తే స్వభావతః।
మమతాం త్యజతాం తేషుమహ దుత్పద్యతేయశః ॥

తా॥ సంపదలే సర్వసాధారణముగా నందఱికిని లోభముకలుగఁజేయును. అయినను ఆసంపదలయందు మమత్వమును (మమకారమును) విడిచిపెట్టఁడు. అట్లు మమకారమునువిడిచిపెట్టినచో గొప్పకీర్తికలుగును.(అనఁగా నెవ్వరుధనమునందు పేరాసనంది కడుపునకు తినకయు, చేతిమీదుక నొకనికియ్యకయునుందురో వారికపఖ్యాతికంటె వేఱొకలాభములేదు.అట్లులుబ్ధులుగనుండక తాముతిని యొకరికిచ్చుచు వచ్చిరేని గొప్పకీర్తినందుదురు) అని భావము.

శ్లో॥ మృతోప్యర్థం నమోక్ష్యామిబద్ధ్వా నేష్యామిమూర్ధని।
ఇతిచేత్సుదృఢోలోభః పాత్రేదేయమశంకితమ్ ॥ ౩౮॥

తా॥ చచ్చినను డబ్బువిడిచి పెట్టను. చచ్చిపోవునపుడు నెత్తినఁగట్టుకొని పోయెదను. అనియెవనికి కాంక్ష (ధనమునందాశ) గట్టిగానున్నదో వాఁడు ఏవిధమైన సంశయమును పెట్టుకొనక పాత్రునకు ఇచ్చుట మంచిది. అనఁగా) తానుపోవునపుడు వెంటఁగొని పోవలయుననుత లంపుగల ధనలుబ్ధుఁడు దానుతినకయును, ఒకరికిపెట్టకయు దాచియుంచిన నెంతమాత్రము వెంటరాదు. సత్పాత్రునకిచ్చిన ద్రవ్యమే యింకొకజన్మములో తనకుపయోగించును అని భావము.

శ్లో॥ షష్టిర్దేశాంతరే లభ్యా శతం దత్వాత్రి నైగమే।
పాత్రేత్వేక మిహోత్సృజ్య పరత్రానంతమాప్యతే ॥

తా॥ ఇచ్చుట వర్తకునకు నూఱురూపాయ లిచ్చినచో నితరదేశము నందు అరువదిరూపాయలు తీసికొనవలసి వచ్చును. ఈజన్మమునందు సత్పాత్రునకు ఒకరూపాయ యిచ్చినచో మఱొకజన్మమునందు మితిలేనిద్రవ్యమును పొందవచ్చును. అనఁగా లోభియగువాఁడు తనధనమును వృద్ధిచేయఁదలఁచి వర్తకునకు వడ్డీకిచ్చినయెడల వాఁడు వర్తకములో లుగసానుపడి దేశాంతరమునకుఁబోయి కూర్చుండి మొదటికే మోసము చేయును. ఒకవేళ ఇచ్చినను రూపాయ కణానో యర్ధణానో యిచ్చును. సత్పాత్రునకు దానముచేసిన ద్రవ్యము అట్లుకాక యిచ్చినదానికంటె నెన్నియోరెట్లధికముగా నింకొక జన్మమునందు వచ్చును అనిభావము.

శ్లో॥ కో దత్తే క ఇవాదత్తే స్వాదృష్టం స్వేనభుజ్యతే।
ధీభేదమాత్రే దాతృత్వే క్లిశ్యంతే కృపణాః కియత్ ॥౮౦

తా॥ ఇచ్చువాఁడెవఁడు? పుచ్చుకొనువాఁడెవఁడు? వానివానియదృష్టముచే వానివానికి వచ్చుచున్నది. దాతృత్వము బుద్ధిభేదము మాత్రము. అందులకు గాను కృపణులు (లోభులు) ఎంతో దుఃఖము నందెదరు? ఇచ్చుటకు లోభులు ముక్కుతో నేడ్చినందున లాభ మేమియు లేదు.

శ్లో॥ స్వాతంత్ర్యం యదిచోరేషు భోక్తృత్వం యదిబంధుషు।
నిష్కర్షేతు భవిమస్స్వామ్యం త్యక్త్వాలభ్యాతాం యశః॥

3988

తా॥ లోభులు 'ఇది నాసొత్తు దీనికి నేను యజమానుఁడను' అని భ్రమ జెందుదురు. సత్యముగా నదివారిదే యైనచో దొంగలపహరించుటకును చుట్టపక్కములు మెక్కుటకును ఎట్లు వీలగుచున్నది? అనఁగా నందఱు చేతి మీదుగ నొకరికిచ్చుటకు బుద్ధిపుట్టక దొంగలెత్తుకొని పోయినను,చుట్టపక్క ములు కుడిచిబోయినను ఏమియు చేయఁజాలకున్నారు. ఆలోభమును విడిచి దానముచేసి కీర్తినందుట మంచిది అని భావము.

శ్లో॥ న ధైర్యేణ వినా లక్ష్మీ ర్నశౌర్యేణ వినా యజః।
సజ్ఞానేన వినా మోక్షో నదానేన వినా యశః ॥ ౮౨॥

తా॥ ధైర్యవంతునకు సంపదకలుగునుగాని ధైర్యహీనునకు ఎన్నటికిని సంపద కలుగదు. పరాక్రమవంతునకు జయము కలుగునుగాని పరాక్రమహీనునకు యుద్ధములయందు జయముకలుగదు. జ్ఞానముచేత మోక్షముకలుగునే కాని జ్ఞానములేక యెన్నటికి మోక్షముకలుగదు. దాతృత్వముచేత కీర్తికలుగునేకాని లుబ్ధత్వము (లోభము) చేత కీర్తికలుగదు అని భావము.

## బలము.

శ్లో॥ స్వకీయాన్భుంజతే మత్స్యాః స్వాపత్యాని ఫణాధరాః।
బలాబలవ్యవస్థేయం బలిన స్త్వేకు తోభయాః ॥ ౮౩॥

తా॥ చేఁపలు చేఁపలను తినుచున్నవి. పాములు తన పిల్లలనే తినుచున్నవి. అనఁగా పెద్దచేఁపలు చిన్నచేఁపలను, పాములు తన గ్రుడ్లను తినుచుండుటను చూడఁగా బలవంతులు బలహీనులనుకొట్టి తినుచుందురు అని తోఁచుచున్నది. కావున బలవంతుల కెన్నటికి నేవిధమునను భయముండదు

శ్లో॥ గురుంహత్వా దివంయాతి తృణంఛిత్వా పతత్యధః।
బలినాందుర్బలానాంచ శ్రుతయో౽పి ద్విధాస్థితాః॥

తా॥ యాజ్ఞవల్క్యుఁడు తనగురువయిన వైశంపాయనుని యవమా
ంచి యూర్ధ్వలోకాదులనందెను. వైశంపాయనుఁడు తృణప్రాయునిఁగభా
ంచి శిష్యుని పరిభవించి సద్గతుల నందక పోయెను. తానుచెప్పినవేదమునుక
క్కించిన కక్కిన మలల వేదమును శిష్యుఁడు వడసెను. అందుచే యజుర్వే
దము కృష్ణయజుస్సు. శుక్లయజుస్సు అని రెండువిధములాయెను. దేనికి గాని
బలము ప్రధానము.

శ్లో॥ బలినోబలిన స్నిహ్యాం త్యబలంతునిగృహ్ణతే॥
దావందీపయతే చండో దీపంవ్యాహంతి మారుతః॥

తా॥ బలవంతులు తనవలె బలవంతులగు వారిని జూచి వారితో
స్నేహము చేయుచున్నారు. బలహీనులను అణఁగఁ ద్రొక్కుచున్నారు. అది
లోకానుభవము. ఎట్లనగా, చండమారుతము బలముగల దవానలమును
ప్రజ్వలింపఁజేయుచున్నది. బలహీనమైన (అల్పబలముగల) దీపమును ఆరుపు
చున్నది.

శ్లో॥ బాధకా అపి లోకానాం బలినోబిభ్యతి స్వయమ్।
సర్వం బలవతాం పథ్యం భిషగ్భిరభిధీయతే॥ ౪౬॥

తా॥ సకలలోకబాధకులయ్యును బలవంతులు స్వయముగా భయము
నందుచున్నారు. బలవంతములగు వ్యాధులకే వైద్యులు సర్వవిధములయినపథ్య
ములఁ బెట్టుచున్నారుగాని సామాన్యములయిన వ్యాధులకు పథ్యములేదు

అనఁగా బలవంతమైన వ్యాధికి పథ్యరూపమైన భయము స్వయముగనే వదికాని యితరులమూలముగ లేదు అని భావము.

## శౌర్యము.

శ్లో॥ శుభప్రారబ్ధలబ్ధాపి లక్ష్మీః శౌర్యవివర్జితా।
శోకే నఽదహ్యమానాఽస్తే షండే కులవధూరివ॥

తా॥ ఎవఁడైన నొకఁడు పూర్వజన్మమునందు సత్కార్యములు యున్నచో నీ జన్మమునందు లక్ష్మి వచ్చుచున్నది. ఆ లక్ష్మి సంపన్న శౌర్యవంతుఁడైనయెడల నా లక్ష్మి శోభగలదియగును. అట్లుకానిచో లక్ష్మి నపుంసకుని యిల్లాలివలె శోక సంతప్త మానసయగుచున్నది. అనఁ లక్ష్మియుండియు శౌర్యము లేకున్న లాభములేదు అని భావము.

శ్లో॥ సర్వత్రలాల్యతేశూరో భీరుస్సర్వత్ర హన్యతే।
పచ్యంతేకేవలా మేషాః పూజ్యంతే యుద్ధదుర్మదా

తా॥ శూరునందఱు లాలించుదురు. భయశీలునందఱు జంపుదు యుద్ధమునందు నేర్పుగలిగి మదించిన పొట్టేళ్లనందఱు పూజించుదురు ( శాదులిచ్చి (ప్రేమతో సాకుదురు) సామాన్యములయిన యుద్ధముల గింపని) మేఁకలను జంపి తిందురు.

శ్లో॥ భార్యాయాస్సుందరస్స్నిగ్ధో వేశ్యాయాస్సుందరో ధ
శ్రీదేవ్యాస్సుందర శ్శూరో భారత్యాస్సుందరస్సు

తా॥ భార్యకుఁ గ్రొత్తచెలిమికాఁడు ఇంపుకాఁడు. వేశ్యకు ధనవంతుఁడు ఇంపుకాఁడు. లక్ష్మికి శూరుఁడు ఇంపుకాఁడు. భారతికి (విద్యకు) బుద్ధిమంతుఁడు, ఇంపుకాఁడు, భార్య భర్తపై గ్రొత్తలో నెక్కువ మక్కువ గలదియగును. వేశ్య ధనవంతుని జేరును. శూరుని లక్ష్మి జేరును. బుద్ధిమంతునకు విద్య యబ్బును అని తాత్పర్యము.

శ్లో॥ నశౌర్యం శౌర్యమిత్యేవ స్తూయతేబుద్ధిశాలిభిః ।
కింతునీత్యా సమాశ్లిష్టం వాగ్మిత్వమివమేధయా ॥ ౫౦॥

తా॥ మేధతో (గ్రహణ ధారణమగు బుద్ధితోఁ) గూడిన వాగ్మిత్వము పండితులనడుమ సమయోచితముగ మాట్లాడునేర్పు) వలె నీతి సహితమైన శౌర్యము బుద్ధిమంతులచే, గొనియాడఁబడునుగాని కేవల శౌర్యము శౌర్యముగా నేరదు. శౌర్యముతో పాటు నీతియునుండుట మంచిది.

శ్లో॥ శౌర్యేణ లోకసేవ్యత్వం శౌర్యేణక్షితిపాలతా ।
శౌర్యేణలభ్యస్స్వర్గోఽపి శౌర్యం కస్యనసాధనమ్॥౫౧॥

తా॥ శౌర్యవంతుఁడు సకలలోకులచేత సేవింపఁ బడుచుండును. శౌర్యముచేతనే రాజ్యము లభించును. శౌర్యముచేతనే స్వర్గభోగములు కలుగును. శౌర్యముచే సాధ్యముకాని దేదియులేదు. సర్వము శౌర్యసాధ్యము.

శ్లో॥ సమరేషునరేంద్రాణాం సవనేషు ద్విజన్మనామ్ ।
ప్రతికర్మసునారీణాం శౌర్యంభవతి భూషణమ్ ॥ ౫౨॥

తా॥ యుద్ధరంగములయందు రాజులకు శౌర్యమేభూషణము. బ్రాహ్మణులకు యజ్ఞములయందు శౌర్యమే భూషణము. అలంకారములయందును స్త్రీలకు శౌర్యమే భూషణము.

శ్లో॥ శౌర్యేతుల్యేకధంవృత్తం స్వామిదాసఇతిద్విధా।
అన్వయవ్యతిరేకాభ్యాం నీతిరిత్యవధార్యతామ్ ॥

తా॥ ఇరువురును శౌర్యవంతులే యయినయెడల రాజెవఁడు? భ
వఁడుఅనఁగా నిరువురు శౌర్యవంతులయినచో రాజు, భటుఁడు అను భే
లేదు శౌర్యమున్న స్వామిత్వమున్నది. శౌర్యము లేకున్న ప్రభుత్వము లేదు.

శ్లో॥ నజయాయ స్వతశ్శౌర్యం కింతునిత్యోపబృంహితం।
ప్రయుక్తంహిజయత్యస్త్రం ప్రయోక్తారినస్వతః క్వచి

తా॥ నానాటికి వృద్ధినొందింపఁబడు శౌర్యము జయము నిచ్చును
పుట్టిననాటిది పుట్టినట్లేయున్నచో జయము దానివలనఁ గలుగదు. శూరు
ప్రయోగింపబడి అస్త్రము శత్రువును తుదముట్టించునుగాని యూరక
దానంతటఁ యదిపోయి శత్రువును జంపఁజాలదుగదా?

శ్లో॥ ఇదమేవపరం శౌర్య ముపాయైస్త్రిభి రన్వితమ్।
ఇదమేవపరంమౌర్ఖ్య ముపాయైస్త్రిభి రుజ్ఝితమ్॥

తా॥ సామము, దానము, భేధము అను మూఁడుపాయములతోఁ గూ
శౌర్యమే గొప్పశౌర్యముగాని అవి లేనిది శౌర్యముకాదు. అనగా స
ద్యుపాయ హీనుండయిన శౌర్యవంతుఁడు మూర్ఖులలో నగ్రే సరుఁడు
యెన్నటికిని శౌర్యవంతుఁడు కాఁడు.

శ్లో॥ పరాక్రమంతే యుద్ధేషు సమమేవోభయే భటాః।
విజయంతే హ్యుపాయజ్ఞా విజీయంతే తదుజ్ఝితాః॥

తా॥ యుద్ధరంగములయందు రెండుపక్షములవారు సమముగనేయుద్ధ
ము చేయుచున్నను సామాద్యుపాయములు గలవారు జయించుచున్నారు.
సామదాన భేదోపాయములు లేనివారు అపజయము నందుచున్నారు. జయ
మునకు శౌర్యముకంటె నుపాయములు ముఖ్యములయిన సాధనములు అని
భావము.

## అదృష్టము.

శ్లో॥ కింశాస్త్రైర్బహుధాభ్యస్తైః కిం చాతుర్యేణ కిం ధియా ।
కిం శౌర్యేణా నివార్యేణ లలాటేచే న్నలిఖ్యతే॥౫౭॥

తా॥ నుదుటబ్రహ్మగీత (అదృష్టము) లేనప్పుడు ఎన్ని శాస్త్రములు
చదివియు ప్రయోజనములేదు. ఎంత చాతుర్యమున్నను లాభములేదు, ఎంతబు
ద్ధియున్న నుపయోగములేదు, నిరాటంకమైన శౌర్యముండియు ఫలములేదు.

శ్లో॥ ఘటమానాః కుటుంబేషుదదతీతి విపశ్చితః ।
మూఢేషురమతే లక్ష్మీరహోదిష్టస్యచేష్టితమ్ ॥ ౫౮॥

తా॥ చదువుకున్నవారు ఆలుబిడ్డలు మొదలగు వారివిషయమైయును,
సత్కార్యముల విషయమైయును తన్నుపయోగించెదర నుతలంపుతో లక్ష్మి
మూఢులఁ జేరుచున్నది. ఇది యంతయు దైవచిత్రము, అనఁగా సత్పాత్రవిని
యోగమున పండితులు దరిద్రులగుచున్నారు. దుష్కార్యములకు వినియోగించు
మూఢులు లక్ష్మీసంపన్నులుగ నున్నారు. ఇదియంతయు దైవచిత్రముకాని
వేఱేమియుకాదు.

శ్లో॥ తుల్యంకర్షంతి పృథివీం తుల్యం శాస్త్రాన్యధీయతే।
ఉన్మజ్జంతి నిమజ్జంతి దైవ స్యైకస్య చేష్టయా ॥

తా॥ ఒకటిగాదున్ని విత్తి వ్యవసాయముచేయుచున్న వారెందరో యున్నారు. ఒక యుపాధ్యాయునొద్ద నేకకాలమునందొకేరీతి గాచదువు వారెందరోయున్నారు. కానిఫలముమాత్రము ఒక్కొకరికొక్కొక నున్నది. అదివానివాని యదృష్టముకాక వేరేమి?

శ్లో॥ లుభ్యంతి వితరంతోఽపి కుప్యంతి సరలా అపి।
ముహ్యంతిమతిమంతోఽపి భోక్తుర్భాగ్యవిపర్యయాత్॥

తా॥ అనుభవించువాని దురదృష్టముకొద్దియు దాతృత్యగుణము వారు సయితము లోభులగుచున్నారు, చక్కగ మాట్లాడుస్వభావము వారు సయితము కోపించు చున్నారు, మహాబుద్ధిమంతులు సయితము మోహములందు చున్నారు. పాత్రాపాత్రత నెఱుంగజాలక పోవుచున్నారు. ఇందుకు నదృష్టము కారణము.

శ్లో॥ అధీయంతే విజానంతి విరజ్యంతి ముహుర్ముహుః॥
నాత్యంతాయ నివర్తంతే నరా వైషమ్యతో విధేః॥

తా॥లోకులందఱు చదువుచున్నారు సకల శాస్త్రములను, తెలిసికొనుచున్నారు. అడుగడుగునకు విరాగమునందు చున్నారు కాని విధివైషమ్యమువలన జనన మరణములనుండి తప్పించుకొనజాలకున్నారు.

శ్లో॥ దోహదై రాలవాలైశ్చ కియద్వృక్షాను పాస్మహే।
తేతు కాలం ప్రతీక్షంతే ఫల పుష్ప సమాగమే॥ ౬౨॥

తా। మనముచెట్లు చిగిర్చి పుష్పించి ఫలించవలయునని యెంతో శ్రద్ధతో పాదులుకట్టి యెఱువువేసి నీరుపోసి పెంచు చున్నాము. మనమట్లు ఎంత ప్రయత్నించినను ఆయాకాలమురానిది యవి చిగిర్చి పూచి ఫలింపవు, అని భావము.

శ్లో॥ కః ప్రసూత పురోవాతం కః ప్రేరయతి వారిదమ్ ।
ప్రాప్తేతు శ్రావణే మాసీ భవత్యేకార్ణవంజగత్ ॥

తా॥ తూర్పుగాలినెవఁడు కలిగించు చున్నాడు? మేఘుని ప్రోత్సాహపరచు చున్న వారెవరు? శ్రావణ మాసము పుట్ట గానే ప్రపంచమంతయునొకేసముద్ర మగుచున్నది. అనఁగా నేకాలమునకేది యెట్లు జరుగవలయునోఆ కాలమున కదియట్లు జరుగును అని భావము.

శ్లో॥ కాలఃకరోతి కార్యాణి కాలఏవ విహంతిచ ।
కరోమీతి విహన్మీతి మూర్ఖో ముహ్యతి కేవలమ్ ॥

తా॥ మూర్ఖుఁడు ఈకార్యమును నేను చేయుచున్నాను. ఈకార్యమును విడిచి వేయుచున్నాను అని కర్తృత్వా కర్తృత్వములను తనయందారోపించు కొనుచున్నాఁడు. కానిఅది యెంత మాత్రము సరికాదు. సర్వమునకు అదృష్టము ముఖ్యకారణముకాని మనదేమియులేదు.

శ్లో॥అపి కాలస్య యఃకాలస్సోఽపి కాల మపేక్షతే।
కర్తుం జగన్తి హర్తుం వా కాలస్తేన జగత్ప్రభుః॥ ౩౫॥

, తా॥సకల జీవుల నాశన మొందించు కాలుఁడు (యముఁడు) సయిత లోకముల నిర్మించుటకుగాని, లయింపఁ జేయుటకుగాని కాలమును ప్రతీక్షి చు చున్నాఁడు.(కాలమురానిది యముఁడు నేమియుజేయఁజాలఁడు. అం వలన జగత్తునకు ప్రభువు కాలమని చెప్పవలయును.

శ్లో॥ కాలస్సదాగతిరపి స్థాయీవ పరి చేష్టతే।
చండ మారుతవద్విశ్వ మధరోత్తరయ న్క్షణాత్ ।౬౬।

తా॥ కాలము (విధి) ప్రలయ కాలమునందలి వాయువు లాగున స ప్రపంచమును నిముసములో తలక్రిందులుగమారు చేయుచు సదాగతి ( ప్పుడు గవనము గలది) యయ్యు చలింపని పగిది చూపట్టుచున్నది.

## ఓర్పు

శ్లో॥ కాలశ్చాలయతి ప్రాయః పండితా న్పామరానపి।
తంచే చ్చికీర్షతి వశే తితిక్షైవ మహౌషధమ్॥ ౬

తా॥ కాలము(విధి)తరుచుగా పండితులను పామరులను, గూడ చ పఁజేయుచున్నది. అనఁగా పండితులు సయితము కాలమునకులోఁబడవలసి కాని తమ పాండిత్యము కాలము నేమియుఁజేయఁజాదు, ఆకాలమును స్వా ధీనము చేసికొనఁ దలఁచినవారికి ఓర్పునకు మించిన సాధనములేదు.

శ్లో॥ ప్రేరంషు ప్రహరిష్యంతః కతి కామాదయోఽరయః।
క్షణాన్నశ్యతి లోకోఽయం క్షమా చేన్న నియచ్ఛతి॥

తా॥ కామము క్రోధము, లోభము మొదలుగాగల యంత శ్శత్రువులు ఎందఱినో గుంటలో త్రోయుచున్నవి. అనఁగా ఎందఱో కామాదులకు లోనయి నశించుచున్నారు. ఓర్పునునది లేకున్నయెడల నాశత్రువుల జయించి లోకము సుఖముండఁజాలదు.

శ్లో॥ అపకారపరాణా మప్యుపకుర్వంతి సాధవః ।
ఛిందంత మపివృక్షస్స్వచ్ఛాయయా కింనరక్షతి ॥

తా॥ తమకపకారము చేసినవారికి సయితము సజ్జను లుపకారమునే చేయుచున్నారు. చెట్టు తన్ను నఱకుటకు వచ్చినవానినిఁగూడ తన చల్లని నీడచేఁ గాపాడుచున్నది. అనఁగా ఓర్పుండుట మంచిది అని భావము.

శ్లో॥ స్రవత్యేవ సదాజ్ఞానం స్రవత్యేవ సదా తపః ।
ఛిద్రం ఛిద్ర మనుప్రాప్య న చే చ్ఛాదయతి క్షమామ్॥

తా॥ ఎవఁడుగాని కామాదులకు లోనై ఓర్పు లేకున్నచో జ్ఞానము పోవుచున్నది. తపము చెడిపోవుచున్నది. అనఁగా క్షమారహితునకు జ్ఞానముండియు తపముండియు లాభము లేదు. అని భావము.

శ్లో॥ క్షమాంరక్షంతియే యత్నాత్క్షమాం రక్షంతి తే చిరం।
క్షమా స్తే నిభృతా యేషుక్షమా స్తే సర్వకర్మసు ॥౭౧॥

తా॥ ఎవరు క్షమను (ఓర్పును) రక్షించుచున్నారో (అనఁగా ఎవరు మిక్కిలి జాగరూకతతో నోర్పుగలిగి యున్నారో వారు చాలకాలము

క్షమను (భూమిని) రక్షించుచున్నారు, ఎవరియందు సహన మధికముగ నున్నదో వారు సకల కార్యముల సాధింప సమర్థులగుచున్నారు.

శ్లో॥ మూర్ఖాశ్శమయితుం దుఃఖం సంరభంతే తత స్తతః ।
క్షమయైవ నిగృహ్ణంతి ధీరా స్సంరంభవర్జితాః ॥౭౨॥

తా॥ మూర్ఖులు అంతకంతకు దుఃఖోపశమనమునకుగా నాత్ర పడుదురు గాని సహనము గలిగియుండరు. ధీరులు సంరంభ రహితులయి సహనము చేతనే దుఃఖములఁ దొలఁగించు కొనుచున్నారు. అనఁగా దుఃఖమునుండి తొలఁగి సుఖమననుభవింపఁ గోరినవారు సహనము గలిగియుండుట మంచిది అని భావము.

## శాంతము.

శ్లో॥ ఆకాల్యా దానిశీథాచ్చ కుత్స్యర్థం వ్యాప్రియామహే।
నచనిర్వ్రాణు మో జాతు శాంతాస్తు సుఖ మాసతే ॥

తా॥ ఉదయము మొదలుకొని సాయంకాలమువఱకు పొట్టపోసికొనుటకొఱకే మేమో తంటాలు పడుచున్నాము కాని అందువలన నొకప్పుడయినను సుఖ మున్నవారము కాము. కామాది వికారములు లేక శాంతులయినవారు ఉదయము మొదలుకొని సాయంకాలము వఱకు శ్రమపడ నక్కరలేకయే సుఖ మనుభవించు చున్నారు.

శ్లో॥ నాయాస్యంతి శరీరాణి నదైన్య మవబుధ్యతే ।
సంభవత్య పి చానందః శాంతిమభ్యస్యతాం సతామ్॥

తా॥ శాంతి నభ్యసించియున్న సత్పురుషులు శరీరముల కష్టపెట్టుట లేదు. దైన్యముతో నెవ్వరిని యాచించుటలేదు. ఆనందము మాత్రము వారలకు (శాంతులకు) ఉన్నట్లు మరెవ్వరికి గాని లేదు. దీనికంతకు శాంతము కారణము.

శ్లో॥ ప్రసీద త్యపరిస్పంది పయః కలుషితం యథా।
తథాశాంత మపిస్వాంతం ప్రసీదతి శనైశ్శనైః ॥౭౫॥

తా॥ కెలుఁకలు చేయఁబడిన నీరు కదలనీయక యుంచినచో నెట్లు తేటి శుద్ధమగుచున్నదో యాలాగుననే కామాదులతోఁ గూడికలతఁ జెందియున్న చిత్తము సయితము శాంతము నొందినచో మెల్ల మెల్లగ శుద్ధమగుచున్నది.

శ్లో॥యత్నేనమహతా లభ్యా దాసా ద్విత్రా స్సుఖాయ నః।
శాంతస్య కాలాదృష్టాద్యాశ్శతం భృత్యా అవేతనాః॥

తా॥ మనల నుపచారములచే సుఖపెట్టుటకు ఇద్దఱు ముగ్గురు సేవకులఁబెట్టుకొన వలయునన్న నెంతో ద్రవ్యము నెలవుచేసిపెట్టుకొనవలెను. అట్లు పెట్టుకొన్నను ఆ పనివాండ్రు మనయిష్టము వచ్చినట్లు చేయరు. శాంతము నందినవారికి జీతమీయనక్కరలేకయే నూర్లకొలఁది సేవకులు అదృష్టాదులు కలుగుచున్నారు అనఁగా శాంతముగల వారికే సుఖము కలదుగాని యితరుల కే మాత్రమును సుఖములేదు.

## ధర్మము.

శ్లో॥ అపిమృద్వ్యాగిరా లభ్యస్సదా జాగ ర్త్యతంద్రితః ।
నాస్తిధర్మసమోభృత్యః కించిదు క్తస్తు ధావతి ॥ ౭౭॥

తా॥ మార్దవమైన (మంచి) మాటచే లభ్యుఁడయ్యును, ధర్మమను భృత్యుఁడు కునుకు పాట్లు పడక సదా మెలకువగలిగి వర్తించు చున్నాఁడు. కొంచెముచెప్పినచాలును. ఏకార్యమునుగాని శీఘ్రముగఁజేయును. కావున ద్రవ్యము సెలవుచేసి చెప్పినమాట విననిభృత్యుల నుంచు కొనుటకంటె ధర్మమును సంపాదించిన (ధర్మమార్గమున వర్తించిన) సకల కార్యములు సాధ్యములగును.

శ్లో॥ అర్థేనోపార్జ్యతే ధర్మోధర్మేణార్థ ఉపార్జ్యతే ।
అన్యోన్యాశ్రయణంహ్యేత దుభయోత్పత్తి సాధనమ్॥

తా। ద్రవ్యముచే ధర్మము సంపాదింపఁబడు చున్నది, ధర్మమునర్థము సంపాదింపఁబడు చున్నది. ఒకదానితో నొకటి సంబంధముగల్గుటయే ధర్మార్థములకు సాధనము. మృదువాక్కుల (మంచిమాటలచే) లోకమున నందఱు ధర్మార్థముల గడింపవచ్చును. అని భావము.

శ్లో॥ విపణిః పుణ్యతీర్థాని విక్రేతార స్త్వకించనాః ।
తృణేనాప్యంతతో ధర్మః పర్వసుక్రీయతే మహాన్ ॥.

తా॥ ధర్మమును కొనవలెనన్న సకల వస్తువుల నమ్మునట్టి యంగడివీధిలోదొరకదు. ధర్మము నమ్మునట్టి అంగడివీధి పుణ్యతీర్థములు. దాని నమ్మువాండ్రు మిక్కిలి పేదవాండ్రు. అది ప్రతిదినము అమ్మునదికాదు. ఒక

తృణముచేతనే (అత్యల్ప ద్రవ్యముచేతనే) ఆగొప్పధర్మమును సంపూర్ణముగ పర్వదినములయందుఁ గొనుచున్నారు, (అనఁగా ధర్మము దుడ్డుపెట్టి కొనుటకు దొరకునది కాదు. పర్వ దినములయందుపుణ్యతీర్థములకుఁ బోయి శక్తి కొలఁది మంచి మనసుతో దానము లొనర్చిన కలుగును. అనిభావము.

శ్లో॥ చులుకోదక మాత్రేణ ధాన్యముష్టి వ్యయేనచ।
మరుభూమిషు దుర్భిక్షే ధర్మసస్యం మహాఫలమ్ ॥ ౮౦॥

తా॥ ధర్మమను సస్యము మహా విచిత్రముగ ఫలించును. అదెట్లనగా? పైరు పెరిగి ఫలించుటకు సమృద్ధిగనీరుండవలెను. విత్తనములు తగినన్ని విత్తి నారు పెంచవలెను. భూమి సారవంతమయి యుండవలయును. ఆపైని వర్ష ములు అనుకూలముగ గురియవలెను. ఇన్ని యున్ననేకాని సస్యము ఫలించదు ధర్మము అను సస్యము అట్లుకాదు. వర్షములు లేక ప్రపంచమంతయు వట్టి యున్నను నిర్జల ప్రదేశమునందు సయితము గుప్పెడు ధాన్యమువేసి చేరెడు నీళ్లు చిలుకరించినధర్మ సస్యము చక్కఁగ పెరిగి గొప్ప ఫలితము నిచ్చు చున్నది. (అనఁగా యోగ్యాయోగ్య విచారణలేకయే గుప్పెడుముష్టి (ఉపాదానము) పెట్టినను తర్పణాదు లొనర్చినను, గొప్ప ఫలము గలుగు చున్నది. పాత్రాపాత్ర విచారణచేసి ధర్మముచేసినచో చెప్పవలసిన దేమున్నది?

శ్లో॥ ధర్మో నర్మసఖః కామే గురుస్తత్త్వోపదేశనే॥
భట స్సంగర రంగేషు సచివోర్థ సమార్జనే॥ ౮౧॥

తా॥ లోకమునందు మనుష్యునకు మేలుచేయువానిలో ధర్మమునకు మించినదిలేదు. ధర్మముకామమునందు సర్మసఖుఁడయి యభీష్టమును నెరవేర్చు చున్నది. (ధర్మమువలన రంభా సంభోగాదిభోగములు గలుగును.) తత్త్వము నుపదేశించి గురువు మోక్షమును కలిగించులాగున ధర్మము మోక్షము నొసంగును. భటునిలాగున యుద్ధభూములయందు ధర్మము తనకు సాయముచేసి జయమునిచ్చును. మంత్రిలాగున సకలకార్య సాధకమగును.

శ్లో॥ భువివృక్షా దివిచ్ఛాయా భువికూపో జలందివి।
భువి యద్గమ్యతేవిప్రైర్దివి తద్దీయతే సురైః ॥౭౨॥

తా॥ భూలోకమునందు చెట్లువేసి పాంథులకు నీడచే సుఖము కలిగించెనేని వాఁడు స్వర్గమునందు ఎండలో మలమలమాడవలసిన యవసరములేక చల్లని నీడ ననుభవించును. ఇచ్చట బావులు త్రవ్వించెనేని పరలోకమున మంచినీరు వానికి లభించును. భూలోకమున మనమేయేధర్మములఁ జేయుదుమో ఆయాఫలముల సురలు మనకిచ్చుదురు.

శ్లో॥ కదళీకందవ ద్ధర్మో న రోహతి బహిర్గతః।
ఛాదితస్తు ఫలంచారు సూతే పనసమూలవత్ ॥ ౭౩॥

తా॥ ధర్మము అరఁటిదుంపవలె బయలుపడక లోలోన పెరుగును. ధర్మము మనకు తెలియకయే వేరుపనస ఫలముల నిచ్చినలాగున ఫలము నిచ్చును.

శ్లో॥ దుఃఖేనోపార్జ్యతే ధర్మస్సుఖేనతు వినశ్యతి।
కృచ్ఛ్రలబ్ధమముం త్రాతుం నేచ్ఛంతి మునయస్సుఖమ్

తా॥ ధర్మము ఎంతో కష్టపడి ఎన్నో పుణ్యకార్యము లొనర్చినగాని కలుగదు. అట్టిధర్మము నిముసములో తుచ్ఛ సుఖములవలన నశించుచున్నది. కనుకనే మునులు కష్టపడి సంపాదించిన ధర్మమును రక్షించుకొనుటకుగాను ఐహికములయిన తుచ్ఛసుఖముల నిచ్ఛయించరు.

శ్లో॥ సంపాద్యతాం వా యత్నేనయద్వా విక్రయతామయం।
సర్వదా భుజ్యతాం వాస్యై ర్ధర్మో భవతి నాన్యథా ॥

తా॥ మహా ప్రయత్నముతో సంపాదించినను, అమ్మినను, నిత్యము నానే ఫలనుభవించినను అనుభవించనిమ్ము. ధర్మముమాత్రము నశించదు. అనఁగా ద్రవ్యము మొదలగునవి యితరులకు చిక్కును కాని ధర్మము ఒకరిది వేఱొకరికి యెంతపాటుపడినను రానేరదు.

## ❀ అర్థము ❀

శ్లో॥ అర్థవంతః ప్రశస్యంతే నింద్యంతే తద్వినాకృతాః।
ఆగమేష్వపి చే దేవ మద్భుతం కిం శరీరషు॥ ౮౬॥

తా॥ ధనవంతు లందఱిచే కొనియాడఁబడుచున్నారు. అర్థహీనులనం దఱు నిందించుచున్నారు. శాస్త్రములందును అర్థ వత్తులు కొనియాడఁబడుచున్నవి. అర్థహీనములు నిందింపఁబడుచున్నవి. అట్లుండ దేహధారుల విషయమై యేమివింత?

శ్లో॥ అర్థోఽ ప్యర్థేన చేత్సాధ్యః కావార్తా ధర్మకామయోః
అర్థ స్సర్వ జగన్మూల మనర్థోఽర్థవిపర్యయః॥ ౮౭॥

తా॥ మోక్షము ధనముచేతనే సాధింపతగినచో ధర్మకామము లుండియు ప్రయోజనములేని వగును. ‘‘ ధనమూలమిదం జగత్ ’’ అను వాక్యము ప్రకారము ప్రపంచమంతయు డబ్బుతోనే యున్నది. ధనములేనివాఁడు ఎందుకు గొఱగాఁడు.

శ్లో॥ కర్మ జ్ఞానంచ మోక్షాయ కర్మణ్యర్థోఽధికారితా ।
అతోఽర్థేనైవ కైవల్యం నకైవల్యేన లభ్యతే ॥౮౮॥

తా॥ మోక్షమునకు మార్గములురెండు. జ్ఞానమువలన మోక్షము కలుగుచున్నది. పుణ్యకర్మలవలన మోక్షము కలుగుచున్నది. జ్ఞానము కుదురుట దుర్లభము. యాగాది పుణ్యకార్యములు చేయుటకు ద్రవ్యముకావలయును. ద్రవ్యమున్నవాఁడు యాగాది పుణ్యకర్మములఁజేసి కైవల్యమునందును. కావున కైవల్యము ధనమున్ననే సిద్ధించునుకాని కైవల్యముచేత (వైరాగ్యముచేత) సిద్ధింపదు అని భావము.

శ్లో॥ కథమర్థం నిషేధంతు శ్రుతయస్స్మృతయో పివా ।
యాసామేకం పదమపి నచలత్యర్థతో వినా ॥ ౮౯॥

తా॥ వేదములుగాని స్మృతులుగాని అర్థమును ఏలనిషేధించును? నిషేధింపనే! నిషేధింపవు. ఏలనఁగా ఆశ్రుతి స్మృతులకు సయితము అర్థములేక పదము(అడుగు)అయినను సాగదు. సర్వమునకు అర్థమే ముఖ్యమని భావము.

శ్లో॥ లక్ష్మీశ ఇతి గోవిందో మేరుధన్వేతి శంకరః।
హిరణ్యగర్భ ఇత్యేవ బ్రహ్మాఽపి బహుమన్యతే ॥౯౦

తా॥ లక్ష్మీపతి (ధనమునకు యజమానుఁడు) అని విష్ణువును, మేరు ర్వతము (బంగారుకొండ) విల్లుగా గలవాఁడని శివుని, హిరణ్యగర్భుఁడు పొట్టలో బంగరుగలవాఁడు ) అనిబ్రహ్మను, అందఱు గొప్పగా తలంచు న్నారుగాని లేనన్న వారిని తలంచువారెవరు? లోకమున ధనవంతు నం బు కొనియాడి మర్యాదచేయుదురుగాని ధనహీను నెవ్వరుతలంపనైనఁదలం నను విషయమును బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు గల హిరణ్యగర్భ లక్ష్మీపతి మేరుధన్వ శబ్దములే చెప్పుచున్నవి అని భావము.

శ్లో॥ ఊర్ధ్వంగచ్ఛంతి యంత్యక్త్వా యంగృహీత్వా పతంత్యధః ।
తస్యగౌరవ మర్థస్య తావత్త్రైవా నుమీయతామ్ ॥ (ధ॥

తా॥ లోకమునందు ధన తృష్ణ లేనివారు స్వర్గాది పుణ్యసుఖముల నను వించుటయును, ధన తృష్ణాపీడితులు అధోగతులగుటయు సత్యము. కను నే (ఈ సామ్యముచేతనే) అర్థమునకు గౌరవము ఊహింపవలసియున్నది. లననఁగా? లోకమునందు బరువగు వస్తువును దగ్గరనుంచుకొన్నవాఁడు (బరు గు వస్తువు) పైకెగురలేక క్రిందికి పోవుటయును, తేలికయగు వస్తువు దగ్గర ఉంచుకొన్నవాఁడు (తేలికయగువస్తువు) పైకెగురుటయును మనము నిత్యము చూచుచుంటిమి గదా!

## కామము.

శ్లో॥ గృహిణాయది లభ్యేత గృహిణీ హృదయంగమా ।
సంసార ఇతికోభార స్తం సారమను పశ్యతః ॥ ౯౦ ॥

తా॥ అనుకూలవతియగు భార్యయుండి సంసారసుఖము ననుభవిం
వానికి సంసార మేమాత్రము కష్టముగఁ దోఁపదు.

శ్లో॥ ఆహత్య చినుమ స్వర్గ మపవర్గ మపి క్రమాత్ ।
అనుకూలేహి దాంపత్యే ప్రతికూలే న కించన ॥

తా॥ భార్యా భర్తలు అన్యోన్యము అనుకూలురైనచోఁ స్వర్గసుఖము
మోక్షసుఖమును క్రమముగ నణచి యానందించుదురు. భార్యా భర్త
ప్రతికూలురైనచో సంసారమునకు మించిన దుఃఖము లేనేలేదు.

శ్లో॥ గృహిణీ వృత్తదోషేణ గౌతమోఽత్యంతతాపితః ।
ఆతస్థే దుఃఖ విధ్వంసం కైవల్యం పరమం మునిః ॥

తా॥ గౌతమమహర్షి భార్యయగు నహల్య వడవడిక మంచిదికామి
మిక్కిలి పరితాపము నందిన చిత్తముగలవాఁడై దుఃఖధ్వంసమే పరమమై
మోక్షముకాని వేఱేమి కాదని నిర్వచారము, నుండెను అని భావము.

శ్లో॥ అపి యత్పరమం తత్త్వమర్థేందు కృతశేఖరమ్ ।
తస్యాపి తావా నానందః కి మస్మజ్జననీం వినా ॥

తా॥ పరమతత్త్వమగు నీశ్వరునకు నయితము (ఈశ్వరుఁడు ఆనం
స్వరూపుఁడు. పరబ్రహ్మము ఆనంద స్వరూపము.) కావున ఆ యీశ్వరుని
సకలలోక జననియగు నాది శక్తిలేకున్న నానంద మెట్లు కలుగును?

శ్లో॥ నిందంతి చ ప్రశంసంతి నిగమా యద్గృహాశ్రమమ్ ।
దాంపత్య సామ్య వైషమ్య భేదా దే తద్వ్యవస్థితిః

తా॥ వేదములు గార్హస్థ్యమును కొన్నిచోట్ల నిందించియున్నవి. మఱి కొన్నిస్థలములఁ గొనియాడియున్నవి. ఈ ప్రకారము భేదముగ వేదములు చెప్పుటకుఁ గారణము దాంపత్య సాహ్య వైషమ్యము (అనుకూల దాంపత్యము. ప్రతికూలదాంపత్యము అను భేదము) కంటె వేఱేమియులేదు.

## మోక్షము.

శ్లో॥ ఇంద్రియాణ్యనుపక్లేశ్య ల్యభ్యం శ్రేయో గృహాశ్రమే।
అత స్తుర్యాశ్రమం ప్రాహు రబాధన్యాయబాధితమ్॥

తా॥ గృహస్థాశ్రమమునందు కీర్తినందవలయునను తలంపుగలవారు జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల మిగుల శ్రమపెట్టవలయును. కనుకనే తుర్యాశ్రమము అబాధ న్యాయ బాధితము (ఏబాధయులేనిది) అని చెప్పుచున్నారు.

శ్లో॥ భుజ్యతే యత్సుఖం ధీరై ర ప్రమత్తై ర్గృహాశ్రమే।
స్వర్గ స్తస్యాంగ సంప్రాప్తి రపవర్గో స్య నిత్యతా॥౯౯

తా॥ గృహాఽశ్రమమునందు జాగరూకులయియున్న ధీరులు అనుభవించుస్వర్గసుఖము దేహమున్నంతకాలమేకాని యాకర్మజన్యమైనదేహము నశించిన పిమ్మట స్వర్గాదిసుఖము కలుగదు. సన్న్యాసాశ్రమమునందినవానికి (సర్వసంగ పరిత్యాగియై బ్రహ్మజ్ఞాని యగు వానికి) మోక్షము శాశ్వతమైయుండును.

శ్లో॥ దృష్ట దోషేఽపిగార్హస్థ్యే దూరదర్శితయా స్వయమ్।
గార్హస్థ్య మేవ పరమం మేనే నైయాయికో మునిః॥

తా॥ గృహస్థాశ్రమమునందు దోషములున్నను గౌతమముని దూర దృష్టిగలవాఁడగుటచేత బాగుగ యోచించి అన్నిటికంటె గృహస్థాశ్రమమే యుత్తమమైనదని తలఁచెను.

## రాజ విషయము.

శ్లో॥ ఉచ్చావచం జగద్దౌ స్థ్యస్యశ్రమేక దైవ నిషేధతి ।
ప్రవిష్టమాత్రోన్నృపతిః ప్రపంచమివ న శ్రుతి ః॥ ౧౦౦॥

తా॥ వేదము ప్రపంచముయొక్క దుస్థితిని (సత్యత్వమును) ఎట్లు తొలఁగించుచున్నదో ఆ లాగుననే నానావిధములుగ నున్న జగత్తుయొక్క దుస్థితిని ఒక్కమాటుమాత్రము రాజు వచ్చి తొలఁగించు చున్నాఁడుకాదు అనఁగా వేదము బ్రహ్మజ్ఞానమునందుమాత్రము ప్రపంచమును నిషేధించు చున్నదికాని యితర కాలములయందు ప్రపంచ సత్యత సర్వజన ప్రత్యక్షము రాజుమాత్రము శ్రుతివలెఁగాక జగత్తుయొక్క నానావిధములైన దౌస్థ్యవి ములన నేక పర్యాయములు వాపుచున్నాఁడు.

శ్లో॥ నరాజానం వినారాజ్యం బలవత్స్వపి మంత్రిషు ।
ప్రాణేష్వ సత్సుకిం దేహశ్చండవాతేన ధార్యతే ॥

తా॥ ప్రచండమైనగాలి యెంత వీచుచున్నను ప్రాణవాయువు లేకున్న దేహము ఎట్లు నిలువదో ఆలాగుననే బలవంతులగు మంత్రు లెంద ఉన్నను రాజులేనిది రాజ్యము సాగదు.

శ్లో॥ మాతుఃకించి త్పితుఃకించి దాచార్యా త్కించిదాప్యతే।
సమ్యగ్వినీ తాన్నా ఛ్ఛేత్రిషు సర్వంరాజ్ఞస్తులభ్యతే

తా॥ లోకమునందు ప్రతి మనుజుఁడును తల్లినుండి కొంచెమును, తండ్రిదగ్గరనుండి కొంచెమును, గురువుదగ్గరనుండి కొంచెము పొందవలసిది యున్నదికాని సర్వమును పైముగ్గిరిలో నొకరినుండి గ్రహించుటకు వీలు లేదు. రాజు సకలశాస్త్రిములఁ జక్కఁగ నభ్యసించి సారజ్ఞుఁడయ్యె నేని సర్వము నతని యొక్కనినుండియే పొందవచ్చును. కావున పైముగ్గిరికంటె రాజుగొప్పయని చెపవ్వవలయును.

శ్లో॥ చలంతి సర్వమర్యాదా శ్చలితే సతి పార్థివే।
పర్వతా అపి కంపంతే ప్రసక్తే కంపనే భువః॥ ౧౦౩॥

తా॥ భూమికి కంపము (భూకంపము) కలిగనేని పర్వతములు కదల కుండునా ? తప్పక కదలును. ఆలాగుననే రాజు ధర్మమును విడిచెనేని సకల ధర్మములు నశించును.

శ్లో॥ పత్న్యాః మాంగల్య యోగేన పత్యురాయుః ప్రవర్ధతే।
ప్రకృతీనాంతు భాగ్యేన పార్థివ స్సుఖ మేధతే ॥ ౧౦౪॥

తా॥ భార్యయొక్క మంగళసూత్రబలముచే భర్తకు నాయువు వృద్ధి యగును. జనుల భాగ్యముచేత (సప్తాంగముల సమృద్ధిచేత) రాజు సుఖము నందును.

శ్లో॥ నిర్మితం శతకం సాగ్రం నీలకంఠేన యజ్వనా ।
సభారంజన మేతేన సాధయంతు మనీషిణః॥ ౧౦౫॥

తా॥ నీలకంఠ దీక్షితుల వారిచే సంపూర్ణముగఁ జెప్పఁబడిన యీ నూటు శ్లోకములచేఁ బండితులు సభారంజకులగుదురు గాత.

ఇట్లు శ్రీ నీలకంఠ దీక్షిత విరచితంబయిన
సభారంజన శతకంబు ఆంధ్రతా
త్పర్య సమేతము
సమాప్తము
శ్రీరస్తు.

—





శ్రీరస్తు.

శ్రీనీలకంఠదీక్షిత విరచిత

ఆంధ్రతాత్పర్య సమేతము.

# వైరాగ్య శతకము.

శ్లో॥ ఆస్తే కశ్చన భిక్షుస్సంగృహ్ణన్నవ్యయాని దశ।
నమమేత్యవ్యయ యుగలం యాచామస్తం కిమస్త్యన్యత్॥

బ్రహ్మకపాలధారియయి భిక్షురూపమును దాల్చిన వాఁడను ప్రసిద్ధి గాంచిన యీశ్వరుఁడు పది యవ్యయములను సంగ్రహించియుండ నమమహా మహాఁని రెండవ్యయములకంటె వేఁడదగినదే మున్నది? ఏమియులేదు. అనఁగా వైరాగ్యమునకు మించిన దేదియును సుఖమునిచ్చునది లేదుకాన మాకు వైరాగ్యమొసంగుమని శంకరు నారాధించుదమని తాత్పర్యము.

"జ్ఞానం వైరాగ్య మైశ్వర్యం తపస్సత్యం క్షమాధృతిః॥ స్రష్టృత్వ మాత్మసంబోధో హ్యధిష్ఠాతృత్వ మేవచ। అవ్యయాని దశైతాని నిత్యం తిష్ఠంతి శంకరే॥

అను ప్రమాణముచే నీశ్వరునందు జ్ఞానాదులు పదియునున్నవని గ్రహించునది.

శ్లో॥ధీసచివం ధైర్యబలం సంకల్ప విరోధి శాంతిధనమ్ ।
విశ్వత్రయ విషయమిదం వైరాగ్యం నామ సామ్రాజ్యమ్॥

తా॥ లోకములో నందఱు సామ్రాజ్యము కావలయునని తలంచెదరు. ఆ సామ్రాజ్యము శాశ్వత సుఖము నొసంగదు. వైరాగ్యమను సామ్రాజ్యమన్ననో నిత్యానందదము. దీనికి స్వబుద్ధియే మంత్రి, ధైర్యమే సేన. ఎన్నికయే శత్రువు. శాంతియేధనము. ముల్లోకములు విషయములు. అనఁగా బుద్ధిమంతుఁడు ధైర్యమును బూని యభిలాషలమాని శాంతము వహించి వైరాగ్యముచే ముల్లోకముల జయించి నిత్యానందము నందును.

శ్లో॥రాజ్ఞో భిభ్యతిలోకా రాజానః పునరితోఽపి వైరిభ్యః ।
ఆబ్రహ్మణః కృతాంతాదకుతోభయ మస్పృహారాజ్యమ్ ॥

తా॥ ప్రజలు రాజువలన భయపడుదురు. రాజులు శత్రువులకు భయపడుదురు. పిపీలికము మొదలు బ్రహ్మదనుక సర్వ ప్రాణులును యమునివలన భయపడుదురు. ఇదియంతయు యోచించిచూడ సర్వము భయసహితమే. కావున భయరహితమైన వైరాగ్యము సర్వముకంటె నుత్తమము అని తాత్పర్యము.

శ్లో॥భిక్షాప్రదా జనన్యః పితరో గురవః కుమారకాశ్శిష్యాః ।
ఏకాంతరమణహేతుః శాంతి ర్దయితా విరక్తస్య॥ ౮॥

తా॥ తల్లి దండ్రులు ఆలుబిడ్డలునున్న వానికి సుఖముకాని విరక్తునకు సుఖములేదని యనుకొన నక్కఱలేదు. వైరాగ్యము నందినవానికి భిక్షముపెట్టు వారందఱు తల్లులే. సన్మార్గోపదేశము చేయువారందఱు తండ్రులే;

సద్గురూపదిష్ట విషయంబు నెఱుంగఁగోరి తమ్ము సేవించు శిష్యులే పుత్త్రిలు. పరమానందమునకుఁ గారణమయిన శాంతియే ప్రియురాలు. అని భావము.

శ్లో॥ కిమపి నయే చేష్టంతే కార్యప్రతికార్యయో ర్విరహాత్ ।
సంత స్త ఏవ ముక్తాః సందేహే గౌతమ స్సాక్షీ॥ ౫॥

తా॥ దుఃఖములకు లోను గాక చరించు సత్పురుషులే ముక్తులుకాని ,,ఈ కార్యము సఫలమయ్యెను. ఇది ప్రతికూలమయ్యెను.'' అనిసుఖదుఃఖములకు లోనగువారు ముక్తులుకారు. దుఃఖధ్వంసమే మోక్షమని గౌతమ మతము. కావున నిచ్చట ఆ యభిప్రాయమును తెలిపెను.

శ్లో॥ పతతు నభస్స్ఫుటతు మహీ చలంతు గిరయో మిలంతు
వారిధయః । అధరోత్తర మస్తు జగ త్కా హాని
ర్వీతరాగస్య॥ ౬॥

తా॥ మిన్ను విఱిగిపడినను పడనిమ్ము.భూమి వ్రస్సినను వ్రయ్యనిమ్ము. పర్వతములు కుమ్మర సారె లాగునఁ దిరిగినను ఉరుగనిమ్ము. సముద్రములు ఏకమైనను ఏకము కానిమ్ము. జగములు తలక్రిందు లయినను కానిమ్ము. బ్రహ్మసత్యము జగత్తు మిథ్య యనుజ్ఞానముచే వైరాగ్యము నందినవానికి (బ్రహ్మాత్మజ్ఞానికి) ఏ హానియులేదు అని భావము.

శ్లో॥ కేచోరాః కే పిశునాః కే రిపవః కేచ దాయాదాః।
జగదఖిలం తస్యవశే యస్యవశే హాత మిదం చేతః ॥ ౭॥

తా॥ చిత్తము స్వాధీనముకాని వానికి లోకమున చోరులు, పిశునులు శత్రువులు, దాయాదులు, గలరుకాని చిత్తము వశమయినవానికి దాయలు మొదలుగాగలవార లుండరు. లోకమంతయు నాతని వశమగును. చిత్తమును జయించినవాఁడె విశ్వమును జయించినవాఁడు అని తాత్పర్యము.

## శాంతము.

శ్లో॥ విషయాఉపతిష్ఠంతాం విషయైర్వా సమవయంతు కరణాని।
అంతరమేకం కరణం శాంతం యది కా తత శ్చింతా॥౮॥

తా॥ భోగ్యవస్తువులు లేక (శబ్దాది విషయలు) ఎదుటనున్నను, ఆవిషయములతో కన్ను మొదలగు నింద్రియములు చేరినను, అంత రింద్రియమయిన మనస్సు చలింపక శాంతముగ నుండెనేని బాధకములేదు. మనోనిగ్రహము వైరాగ్యమునకు ముఖ్యము. అదియుండెనేని విషయము లేమియుఁ జేయఁజాలవని భావము.

శ్లో॥ కిం విషయా న్పరిహర్తుంవ స్తవ్యంమేరుకందరేష్వబుద్ధైః।
నహ్యద్భి రనాసంక్తుం పాంసుషు రోహంతి పద్మాని॥౯॥

తా॥ కొందఱు మూర్ఖులు విషయత్యాగమునకుగాను మేరు పర్వతము మొదలుగాఁగల పర్వతములకును గుహలకును పరుగులిడుదురు. మనసుస్వాధీనము చేసికొన్నచో నెక్కడనుండినను విషయములు బాధింపవు. అదిలేనిచో పర్వతములయందు వసించియు లాభములేదు. నీటితో గూడిననే మంటిలో పద్మములు మొలచుచున్నవిగాని నీరులేకుండ మంటిలో పద్మములు పుట్టుట లేదు. ఆలాగే మనసు విషయములతోఁజేరుటచేత ననర్థములు పుట్టునుగాని మనసునిశ్చలముగ నున్నయెడల విషయములేమియుఁ జేయఁజాలవు అని తా

శ్లో॥ అజ్ఞాన మిహ నిదానం ప్రాగ్రూపం జననమేవ భవరోగే।
పరిపాక స్సంసరణం భైషజ్యం నైష్ఠికీ శాంతిః ॥ ౧౦॥

తా॥ రోగమువచ్చినపుడారోగమునకుఁ గారణము తెలిసికొని యద్ది యేవిధముగ పరిణమించినదియును బాగుగ నిదానించి పక్వమునకు వచ్చిన పిదప నౌషధము నుపయోగించినచో, నా వ్యాధి స్వస్థమగును. ఆ లాగుననే జన్మమను రోగమునకు నిదానము, ప్రాగ్రూపము, సంసరణము, భైషజ్యముఅనునవి యున్న జన్మము తొలఁగును. భవరోగమునకుఁ గారణ మజ్ఞానము. (బ్రహ్మజ్ఞానము లేమిచే జన్మము కలుగును.) భవరోగములకు ప్రాగ్రూపముజన్మమే. దానికి సంసరణము కర్మ పరిపాకము. కర్మపరిపక్వ మైన యెడలశాంతికుదురును. అనఁగా జన్మరాహిత్యమును గోరువారు ముఖ్యముగా శాంతమునందవలయును. ఆ శాంతము కర్మపరిపక్వమైనవారికే కలుగునుగాని యన్యులకుఁ గలుగదు అని భావము.

శ్లో॥ స్వేనైవ భుక్త మర్థం సూకర జాతిస్మరో మనుష్య ఇవ ।
దూరే జుగుప్సమానో ధీరో వైరాగ్య మాద్రియతే ॥

తా॥ తాను పూర్వజన్మమునందు పందియయిపుట్టి మహాప్రేమతో ననుభవించిన వస్తువును, ఆ జన్మమును, స్మరణకువచ్చిన మనుష్యుఁడు ఆ జన్మమును గూర్చియు నావస్తువును గూర్చియు రోతనందును. ఆలాగున జ్ఞాన సంపన్నుఁడగు మనుజుఁడు విషయాది భోగములను రోతగానెంచి వైరాగ్యమునందుచున్నాఁడు. అజ్ఞాను లనుభవించు విషయ సుఖముల పురీష తుల్యములుగ నెంచి జ్ఞాని వానినుండి చిత్తమును తొలగించునని భావము.

శ్లో॥ శైశవమివ కౌమారే త త్తరుణిమ్నీవ సఇవవృద్ధత్వే।
న స్వదతేధీరాణాం కామస్య విచేష్టితం శాంతౌ ॥౧౨॥

తా॥ బాల్యమునందు చేయుకార్యములు కౌమారమువచ్చినపుడు రుచిం పనిలాగునను, కౌమారమునదంలి కృత్యములు యౌవనకాలమునందు రుచింపని లాగునను, యౌవనకృత్యములు వార్ధక్యమునందు రుచింపని విధమునను, ధీరులకు(జ్ఞానవంతులకు) శాంతముగలిగి నపుడు కామవిచేష్టితములు (కామవ్యాపారములు) రుచింపవు అని భావము.

శ్లో॥ శతశః పరీక్ష్య విషయా న్సద్యో జహాతి క్వచి త్క్వచి
ద్ధన్యాః। కాకా ఇవవాంతాశన మన్యే తానేవ సేవంతే॥

తా॥ నూటికొక్కరు చొప్పున యెక్కడనో ధన్యులయినవారు విషయాభిలాష మానుదురు. ధన్యులుగాని యజ్ఞానులు వమనముచేసిన యన్నమును కాకులపేక్షించు లాగునవిషయాభిలాషతో సదా వానియందే మునింగి యుందురు.

శ్లో॥చరమా మాతాపితరౌచరమాగృహిణీ సుతా శ్చరమాః
కర్తవ్యేఽతిప్రేమణి కథమిహ ధీరా విరజ్యంతే ॥౧౪॥

తా॥ కడగొట్టు భార్య (చిన్నభార్య) యందును, కడగొట్టు బిడ్డయందును, ప్రేమయధికముగా నుంచుట యీ లోకమున సర్వజనసహజము. అట్లుండ జన్మరహితుఁడయి ముక్తిఁజెందఁ గోరువానికి తల్లి దండ్రులును, ఆలుబిడ్డలును కడగొట్టువారే కావునప్రేమ యధికముగా నుంపఁదగిన వారి

నంపటి విడిచియుండుట బహుకష్టము. అయినను ధీరులు (జ్ఞానులు) వారి యందు ప్రేమవిడిచి వైరాగ్యము నందుదురు.

శ్లో॥ తృణవద్రమన్తి చపలాస్త్రీనామని చండమారుతే
చలితే । ధరణి ధరాఇవ సంత స్తత్రన కించి త్ప్రకంపంతే ॥

తా॥ స్త్రీయను చండ వాయువు వీచిన విషయా ఖిలాషతో గొట్టు కొనువారు గడ్డి పోచలాగున భ్రమించు చున్నారు. (చంచలులు స్త్రీనిగని లేనిమనసు నిలుపఁ జాలక మదనబాధా వివశులగుదురు) సత్పురుషులు పర్వ తముల లాగున చలింపక యుందురు. (జితేంద్రియులగు సత్పురుషు లెందఱు స్త్రీలనుగన్నను మనసుఁజలింప నీయకయుందురు) అజితేంద్రియులు మనసు నిలుపలేక విషయలో లురయిభ్రష్టులగుదురని తాత్పర్యము.

శ్లో॥ కామిజన పరమ భోగ్యే కామసుఖే ధారయంతి భీభత్సం।
సంత శ్శమసుఖరసికా స్సుధాశనా స్సూకరాన్న ఇవ ॥

తా॥ శమసుఖ రసికులును అమృతాశనులును అగుసత్పురుషులు కాము కులచే ననుభవింపఁబడు కామసుఖములను సూకరాన్నమును (అశుద్ధమును) లాగున ఏవగించుదురు. అనితాత్పర్యము.

శ్లో॥ విక్షేపమాత్ర భాజో వికాస కాష్ఠాగత జ్ఞానాః।
స్వస్యాఽపిచేష్టితాని స్వయ మీక్షంతే పరస్యేవ ॥ ౧౭॥

తా॥ వైరాగ్యమునందినవాడు పరునిచేష్టితములనువలెనే తనచేష్టి తములను సమితము చూచుచున్నాఁడు. (లోకమునందు సాధారణ మను

జూడు పరులసుఖదుఃఖములను తనవిగా తలంపనిలాగుననే జ్ఞానజన్య వైరాగ్యముగల పురుషుఁడు స్వవిషయమునందు సయితము ప్రియాప్రియ రహితుఁడయియుండునని భావము.)

శ్లో॥ అస్థానేఽభినివిష్టానామ్మాగ్గానస్థాన ఏవసంతుష్టాః ॥
అనువర్తంతే ధీరాః పితర ఇవ క్రీడతో బాలాః ॥ ౧౮॥

తా॥ బాలురు మంటితోను కొయ్యతోను బొమ్మలుచేసి గుఱ్ఱము, ఏనుఁగు, నెమిలి, చిలుక అనిపేర్లుపెట్టి వానితో నాడి సంతసించుచు తల్లిదండ్రుల సయితము నట్లు తమతోటి పాటుగా నాడుమని పట్టు పట్టుదురు. అపుడా తల్లిదండ్రులు తమకు సహజముగా ఆక్రీడలయందు ప్రీతిలేకున్నను నెట్లు ప్రవర్తింతురో ఆలాగుననే అయుక్తములయిన విషయభోగములయందుఁ బ్రవర్తించి తృప్తినందుమూఢులను ధీరులనువర్తించు చున్నారు. అనిభావము.

శ్లో॥ పుష్ణతి పుష్పేసలిలైర్ముష్ణతి పుష్పం ఫలంచ తరవ ఇవ,
వర్తంతే సంత స్సమ ముపకర్తరి చాపకర్తరి ॥౧౯॥

తా॥ వృక్షములు తమ్మునీళ్లుపోసి పెంచువారలను, పూవులను,పండ్లను దొంగిలు వారలను సమముగనే చూచును. అట్లేసత్పురుషులు తమ కుపకార మొనర్చినవారినిని, అపకార మొనర్చినవారినిని సమముగనే చూచుదురు. అనఁగా సజ్జనులు ఉపకారము చేసినవారియందుఁ బ్రేమఁజూపరు. అపకారము చేసినవారి యందు ద్వేషమును జూపరు అనిభావము.

## ౼ వివేకము. ౼

శ్లో॥ నిత్యానిత్య వివేకస్సర్వేషాంఘట ఘటత్వయోరాస్తే।
స వివేకోయశ్చాం తికృదవివేకోఽ న్యస్సమస్తోఽపి॥ ౨౦॥

తా॥ ఘటము నిత్యముకానిది. ఘటత్వము (ఘటధర్మము) నిత్యమయి నది. ఆలాగుననే బ్రహ్మనిత్యము. ప్రపంచము అనిత్యము. అనువివేకము అం దఱికి నుండవచ్చును. అంత మాత్రముచేతనే యదివివేకము (జ్ఞానము) కాదు. ఏదిశాంతమును కలుగఁ జేయునో యదియే వివేకము. తక్కిన దంతయు నవి వేకముఅని తాత్పర్యము.

శ్లో॥ అనధిగతే కామసుఖే కాలేన యథాప్రవర్తతే తరుణః।
ఏవం బ్రహ్మసుఖేఽపి ప్రవర్తతే కోఽపిభాగ్యవశాత్ ॥ ౨౧॥

తా॥ క్రొత్తగాయౌవనము పొడసూపినవాఁడు అంతకు మునుపుకామ సుఖము నెఱుంగని వాఁడయ్యును యౌవనకాలమునందు విషయములయందెట్లు ప్రవేశించు చున్నాఁడో ఆలాగుననే మున్నెన్నఁడుగాని బ్రహ్మసుఖ మిటు వంటిదని యెఱుంగకున్నను అదృష్టవశమున నొకానొకఁడు బ్రహ్మసుఖమును గోరును అనిభావము.

శ్లో॥పుత్రగుణా స్స్వాతంత్ర్యేదారగుణా శ్చాధివేదనావసరే।
భ్రాతృగుణాదాయవిభాగే ద్రష్టవ్యా మోక్ష్యమాణేన॥ ౨౨॥

తా॥ పుత్రుఁడు సుగుణ సంపన్నుఁడో దుర్గుణసంపన్నుఁడో తెలియ వలయు నన్నసర్వస్వాతంత్ర్యము నొసంగి తెలిసికొనవచ్చును. భార్యయుండ గానే మఱొకవివాహముచేసికొని భార్యగుణముల నెఱుంగనగును. భాగ కాలమున సోదరుఁగుణా వగుణంబుల నెఱుఁగనగును.

పాపము.

శ్లో॥కా మే గతిరితి పృచ్ఛతి చరమశ్వాసేఽపియస్స్వార్థమ్।
తస్యజనస్యాపికృతే పాపాః పాపాని కుర్వంతి ॥ ౨౩॥

తా॥ఇప్పుడో ఇంక కొంచెము సేపటిలోనో ప్రాణములు విడుచువాఁడు "నాగతియేమి? అని తనను గూర్చియడుగుచున్న సమయమునందు, గూడ జీవితకాలమునందలి ద్వేషమును విడువకవాని విషయమై పాపకృత్యములో నరించుదురు. అట్టివారు మహాపాపులు. (లోకమునం దేప్రాణికిని చెఱుపు చేయరాదు. విరోధముచే మూర్ఖులు బ్రతికినంతకాలము జగడములు వేయుచు క్రూరకృత్యములు చేయుదురు. అంతటితో నూరకుండక చావసిద్ధముగ నుండి నీ పుణ్యమని వేడుచున్న వారిని సయితము హింసింతురు. అట్టివారు మహాపాపులు అనిభావము.

శ్లో॥ పితృభిః కలహాయంతే పుత్త్రా నధ్యాపయంతి పితృభక్తిమ్ । పరదారా నుపయాంతః పఠంతి శాస్త్రాణి దారేషు॥

తా॥ కలికాలమునందు పాపమధిక మగుటంజేసి తాముతల్లిదండ్రులతో సదాజగడము వేయుచుండియును తమపుత్రులకు మాత్రము తల్లిదండ్రులయందు భక్తిశ్రద్ధలుండ వలయునని బహునీతులు గఱపుచుందురు. తాముపరస్త్రీ భోగముల మునుంగుచుండియును తమభార్యలకు పతిభక్తిమహిమల నూఁదిపోయుచుందురు. ఇదియంతయు "కోడలికిబుద్ధి సెప్పి యత్తగాఱు వోయె నన్నటులనున్నది.

శ్లో॥ శాంతిరలభ్యా దుపరతిరపాత్రభావః ప్రతిగ్రహానివృత్తిః
క్షాంతిర్దుర్బలతేతిచనివృత్తిర్ధర్మాః కిలావేతే॥ ౨౫॥

తా॥శాంతి (కామక్రోధాదులు లేకుండుట) ఉపరతి (ఊరకుంట) అపాత్రభావము. ప్రతిగ్రహానివృత్తి (దానము పుచ్చుకొనకుండుట) క్షాంతి

(ఓర్పు) దుర్బలతఅనునివి యన్నియు సాగమిచ్చే కలికాలమునందుఁగలిగిన నివృత్తి ధర్మములుగాని సత్యములు మాత్రముకావు. (అనఁగా కలికాలము నందు నివృత్తి ధర్మముల త్యజించియందఱు పాపులగుచున్నారని భావము)

శ్లో॥ నీతిజ్ఞా నియతిజ్ఞా వేదజ్ఞా అపిభవంతి శాస్త్రజ్ఞాః।
బ్రహ్మజ్ఞా అపిలభ్యా స్స్వాజ్ఞానజ్ఞానినో విరలాః॥ ౨౬॥

తా॥ ఈకలి కాలమునందు రాజనీతిమొదలగు సకలనీతులు దెలిసిన వారును, ఆచారాది నియమముల నెఱింగిన వారును, వేదము నభ్యసించిన వారును, వ్యాకరణాది శాస్త్రముల నభ్యసించిన వారును, పరబ్రహ్మమును గుఱ్ఱింగిన వారును, పెక్కండ్రు గలరుగాని తమయజ్ఞానమును (తెలివితక్కువను) ఎఱింగిన వారుమాత్రమరుదు.

శ్లో॥ కలికలుషే మనసిస్వే కథమివజగదార్జవం లభతామ్ ॥
చక్షుర్దోషే జాగ్రతి చాంద్రంద్విత్వం కుతో యాతు ॥

తా॥ తనమనసు ద్వేషములపుట్ట యయియుండ లోకమున్యాయము గానడుచు కొనునా? నడుచుకొనదు. నేత్రములకు జబ్బుండగా చంద్రుఁడొక్కఁడేయిద్దఱు చంద్రులుగా గాన్పించుట పోవునా?పోనేరదు.తనమనసు శుద్ధముగనున్నచో లోకమంతయు మంచిగనే తోఁచును. (తనమనసు శుద్ధముగనున్నచో లోకమంతయు మంచిగనే తోఁచును. తనమనసు శుద్ధముకానున్నచో లోకమంతయు దోషభూయిష్టమయి కనుపించును అనిభావము.)

శ్లో॥ విషయా ననుకూలయితుం విషయిణి హృదయే
విధీయతాం యత్నః। దృశి వేయ నూపకం
కోదృశ్యే పత్వా కృతీ భవతి ౨౭॥

తా॥ విషయములు తన్నాక్రమించి స్వాధీనముచేసి కొనకుండవలయున ను వాఁడు విషయములు గ్రహించునట్టి తనమనస్సు సరిచేసికొన వలయును గాని మఱేప్రయత్నముచేసినను విషయములు తన్నులాగక విడువవు. కంటి కి జబ్బువచ్చినపుడువస్తువులు శుద్ధముగఁ దెలియవుగదా; అప్పుడుకంటికి మం దువేసినయెడల కన్నుబాగుపడి వస్తువులు తెలియగలవుగాని వస్తువులకు వైద్యముచేసినకన్ను బాగుపడునా? పడనేరదు. అనఁగా తనమానసము శుద్ధ ముగా నున్నయెడల విషయములు తన్నేమియుఁ జేయజాలవని తా.

## ఈషణ త్రయము.

శ్లో॥ దారాః పుత్రేషురతాః పుత్రాః పితృధన పరిగ్రహ
వ్యగ్రాః । రోదనశరణా జననీ పరలోక గతస్య
కోబంధుః ॥ ౨౯॥

తా॥ ఎవఁడుగాని చచ్చిపోయినప్పుడు వానిభార్య యంతకుముందు కనుపఱచుచువచ్చిన ప్రియమునంతయు విడిచి బిడ్డలఁ గాపాడుకొన యత్నిం చును. పుత్రులన్నో బ్రతికియున్నంతకాలము ‘మానాయన మానాయన’ యని పైనను ప్రక్కనను పడువారయ్యును ప్రాణముపోయినతోడ నాప్రేమ విడిచి ఆస్తిపాస్తులఁ జాగ్రత పెట్టుచుందురు. కని పెంచి పెద్దవానిగఁ జేసి తనకంటె నెక్కువఁగ భావించుచు వచ్చిన తల్లి యొకమూలఁ గూర్చుండి యేడ్చుచుండునేకాని యేమియుఁ జేయదు; ఇట్లుండఁ జచ్చినవానికి బంధువు లెవరు? వీరెవ్వరు బంధువులు కారని భావము.

శ్లో॥ పశ్యంతి మ్రియమాణా న్మరిష్యతోఽనుమిమతే
స్మరంతి మృతాన్ । కథయంతిచైవ మనస్కృ చ్ఛేష్టం
తే నిత్యవత్తు పరమ్॥ ౩౦॥

తా॥ లోకులు ప్రతినిత్యము చచ్చుచున్న వారినెందఱినో కండ్లారఁ జూచుచున్నారు. ఈ ప్రకారమే యందఱును నశించుదురు. అని ఊహించుచున్నారు. అనియునుంగాక పూర్వము చనిపోయినవారల మాటి మాటికిఁ దలంచుచున్నారు. "ఎప్పటికో యొకప్పటికి పోవువారమేకాని నెత్తిన శిలకొట్టుకొని శాశ్వతముగా నుండువారము కాము. ఉన్న నాల్గుదినములు సద్విషయమున నుండి ముక్తినందు సాధనము నెఱుంగుట యుక్తము" అని ప్రతినిత్యము నోట నుచ్చరించుచునే యున్నారు. అట్లుండియును ఎన్నటికిఁ జావులేనివారిలాగున నెంతో పాటుపడి పాడుదేహమును బలపఱచుచున్నారు.

శ్లో॥ కలహాయంతే మూఢాః కః ప్రతిభూ శ్శ్వః ప్రభాతఇతి ।
తస్యామేవ రజన్యాంకః ప్రతిభూః స్వస్య సత్తాయామ్

తా॥ చిరంజీవులమను,తలంపుతో ధనాదులకుగాను మూఢులు,పెనుగులాడుచు ,,వాఁడు రేపటిదినమువఱకు జీవించియుండునను టకెవఁడు జామీను దారుఁడు?" అనుచున్నారు. అంతదనుక నక్కఱలేదు. వీఁడు ఆరాత్రియుండుటకే యెవఁడు జామీనుదారుఁడు? ఈదేహపాతమునకుఁ గాలము నెవ్వఁడు చెప్పజాలఁడు. కావున నశాశ్వతమయిన ఈ దేహరక్షణమునకని ధనమునకు జగడములు చేయక జ్ఞానమార్జింప నుంకించుట మంచిదనిభావము.

శ్లో॥ అప్రపద మాశిరస్పద మంతః కలిమల మలీమసే
వపుషి। విఫలంగంగా జలమపి మద్యఘటే దర్భముష్టిరివ

తా॥ ఆపాదమస్తకాంతము (నఖశిఖపర్యంతము) దేహమంతయు లోపల ద్వేషమను మలముచే దూషితమయి యుండఁగా గంగాజలము మాత్ర మేమిచేయఁగలదు? కల్లుకుండలో దర్భపోచ వేసియు నేమి ప్రయోజనము లేనిలాగున నాపాదమస్తకాంతము దోషపూరితములగు దేహముల గంగానదిలో ముంచియును లాభములేదు.

శ్లో॥ దండ్యం యత్సుఖహేతోః పుష్ణంతి జనాః కథం తదేవ
వపుః । నహి శర్కరాభిలాషిభి రిక్షోః కాండాని
పూజ్యంతే॥ 33॥

తా॥ దేహమునకు సుఖము కావలయుననువారు వ్రతోపవాసములు మొదలగు వానిచే దానిని శుష్కింపఁ జేయవలయును. అట్లుండ మూఢులు వాని నెన్నివిధములనో పూజించుచున్నారు. చక్కెరగోరువారు చెఱుకుగడలఁ గానుగలోవేసి త్రిప్పవలయునుగాని పూజించిన నేమిప్రయోజనము? అనఁగా శర్కరాభిలాషి యిక్షుఖండంబుల గానుగాడునటుల ఆత్మసుఖాభిలాషి దాని ననశనవ్రతాదుల శుష్కింపజేయవలయును.

శ్లో॥ కుల్యాః కృతా విశాలాః కుడ్యాన్యుపలై ర్నిబద్ధాని।
క్రీతా బలినో మహిషాః కృతకృత్యాస్మ ఇతి మన్యంతే

తా॥ చేలకు నీరుపాఱుటకుఁగాను పెద్దపెద్ద కాలువలు త్రవ్వించితిని. గట్టిగానుండుటకుగాను ఇంటికి గోడలు రాళ్లతోఁ గట్టించితిని. బలసి లావుగల దున్నల నెద్దులఁ గొంటిని. కృతార్థుఁడనయితిని అని మూర్ఖులు తలఁచి

సంతోషించెదరు. వీని యన్నిటిచేత దాను తరింపగల త్రోవయేమైనఁ గల్గినదా? లేదు.

శ్లో॥ ప్రాయో ముహ్యతి చేతః ప్రాణభృతః ప్రాణనిర్గమావసరే। పుణ్యేన యది న ముహ్యతి పుత్రానేవ స్మరన్మ్రియతే॥ 31॥

తా॥ సామాన్యముగా నూపిరిపోవునపుడు (మరణము జెందునపుడు) ప్రతిమనుష్యుని చిత్తము మోహావిష్టమగును. పుణ్యకార్యములయందు చిత్తము లగ్నమయి యుంట యరుదు. చాలవఱకు మృతినందు వారు భగవత్ ధ్యానాదుల విడిచి తమ్ముఁ దరింపఁ జేయుదురను భ్రాంతితో ప్రాణము పోవునపుడు గూడ బిడ్డలఁ దలఁచుచునే, ప్రాణములు విడుతురు.

శ్లో॥ శమయితు మూదరమగ్నిం సంసారే సాగరే నిమజ్జంతి।
తుహినవ్యథానివృత్త్యై న హి వేశ్మని పావకో దేయః॥

తా॥ లోకమునందు జనులు జఠరాగ్ని నిశమింపఁజేయుటకు (క్షుధానలంబును బాపుకొనుటకు) సంసారమను సాగరమునందు మునుఁగుచున్నారు అట్లే చలిబాధను తొలగించి కొనుటకుగాను కొంపకునిప్పంటించుచున్నారా? లేదుగదా! అనఁగా నందఱు నుదర పోషణకు యత్నించువారేగాని సద్గతి నందఁదగిన మార్గమునఁ బయి వారొక్కరు నఱుదని భావము.

శ్లో॥ అర్థానా మధికానాం రాజ్ఞా చోరేణ వా ధ్రువో నాశః।
అన్నే ఖల్వతి భుక్తే వమనం వా స్యాద్విరేకో వా॥ 32॥

తా॥ ద్రవ్యమధికముగఁ జేరిన దానికి రాజులవలనగాని దొంగలవలన గాని హాని సంభవించును. అన్న మధికముగ భుజించిన జీర్ణముకాకవమన మైన నగును. లేకున్న విరేచనము లయిన నగును.

శ్లో॥ ఆహృత్య పరిత్యక్తా జనయంత్యర్థా స్సుఖాభాసమ్ ।
అత్యంత పరిత్యక్తాః పరమానందాయ కల్పంతే ॥౩౭॥

తా॥ అపేక్షతో నార్జించిన ధనము పోయినచో దుఃఖము కలుగును. బుద్ధిపూర్వకముగ విరక్తిచే విడువఁబడిన ధనము పరమానందమును కలుగఁ జేయును.

శ్లో॥ ప్రణమతి పరిసాంత్వయతి ప్రలపతి యాచతి పరిభ్రమతి । ఆ విష్ట ఇవ పిశాచ్యా పురుష స్తృష్ణా వశం యాతః ॥ ౩౮॥

తా॥ తృష్ణా వశమునందిన పురుషుఁడు గ్రహము పట్టిన వానిలాగున దండములు పెట్టును. దాక్షిణ్యమును దాల్చినవారివలె నటించును. నోటికి వచ్చినటుల వాగుచుండును. కనుపించినవారినందఱి దీనుఁడయియాచించును. దేశదేశములు చుట్టుచుండును. అనఁగా తృష్ణావంతుఁడు గ్రహగ్రస్తునివంటి వాఁడు అని తాత్పర్యము.

శ్లో॥ జననాదృష్టాత్పితరౌ పుత్రా జామాతరో వ్యయాదృష్టాత్ । కలహాదృష్టాత్ జ్ఞాతయ ఇతి నిర్ణీతేకిమేష్టవ్యమ్

తా॥ జన్మమెత్తు నదృష్టమున్నచో తల్లిదండ్రులుగలుగుదురు. ధనము మొదలుగాఁగలది సెలవుచేయవలసిన యదృష్టము పట్టినచో పెక్కండ్రు పుత్రులును, పుత్రికలును కలుగుదురు. సదా కలహములు వేయుచుండ వలసిన యదృష్టమున్నచో దాయాదు లధికముగానుందురు. ఈప్రకారము విధిని ర్ణీతముగనున్న వాఁడుచేయవలసినదే మున్నది? అనఁగా అనుభవించికావలసి నదేనని తాత్పర్యము

శ్లో॥ స్వపితు ఃపరలోకాయస్వయ మనుదివసం యదాచరతి।
క్రియతా మిద ముపమానం కిం నాలం పుత్ర వైరాగ్యే॥౪౧॥

తా॥ లోకమునం దే మనుజుఁడుగాని తనతండ్రికి స్వర్గాదిలోకములు సిద్ధించుటకుగాను ప్రతిదినమేమిచేయుచున్నాఁడు? ఏమియుచేయుటలేదు. ఇట్లే నాపుత్రులునాకేమియు చేయరు. అనుదృష్టాంతముతో పుత్రులయందలి ప్రేమనువిడిచి వైరాగ్యమునంద నగునుగదా! అట్లుండపుత్రులు తన్నుద్ధరింతు రను తలంపుతో వారియం దను రాగముం చుటకుఁగారణము మౌఢ్యము అని భావము

శ్లో॥ అననుగతే దారిద్ర్యే కిమనుగతం లక్షణం దృష్టం।
కామస్యాపరి పూర్త్యాకృపణంజగ దాచతుర్వదనాత్ ॥౪౨॥

తా॥ సంపదలతో తుల దూగుచుండు వానిని సదావిడిచి యుండనిది యాశ. ఆయాశయెప్పటికిని తగ్గకుండుటచేత పిపీలికాది బ్రహ్మపర్యంత ముగ ల ప్రపంచమంతయు వానికంటికి కృపణముగనే యుండును

శ్లో॥ నఖలు ధనత్వం జాతి ర్యస్య యదిష్టంత దేవతస్యధనం।
తత్తదివ పామరాణాం ఆకించన్యం ధనం విదుషామ్॥

తా॥ ధన మనఁగా డబ్బనకు మాత్రమే యర్థముకాదు. ఎవనికేది యిష్టమైనవస్తువో యదివానికి ధనము. పామరులకు డబ్బుధనమయిన లాగునఁ పండితులకు దారిద్ర్యముధనము. అనఁగామూర్ఖులు నాకిది కావలయును. అది కావలయునఁ అని తృష్ణావశులయి యుందురు. పండితులు (బ్రహ్మజ్ఞానులు) తృష్ణారహితులయి యీశ్వర ధ్యాన నిధులయియుందురని భావము.

శ్లో॥ స్వీక్రియతేయది తృష్ణా స్వీకర్తవ్యం జగత్సమస్తమపి।
స్వీక్రియతేయది శాంతి స్స్వాత్మాపి స్వస్య భవతినవా

తా॥ లోకమునందు జనులు ఆశను వహించిరేని లోకమునంతయు గోరవలసినదే (అప్పటికి నాశ తీరదు) శాంతమునే వహించినచో తమ దేహములు సయితము లేవు. ఆశగలవానికిసుఖములేదని భావము.

శ్లో॥ యద్దాతారం వశయతి యత్పరిజనమస్య సాంత్వయతి।
యదపత్రపతే నాంతర్భావీ లాభస్స కస్య సమః॥ ౭౫॥

తా॥ ఇచ్చువానిని (దాతను) స్వాధీనముచేయుట, ఆదాతయొక్క పరిజనమును (సేవకులు మొదలగువారిని) మంచిమాటలాడుట, లజ్జవిడుచుట. అనువానిచేఁ గలుగఁబోవు లాభము దేనితో సమానము? దానికి సమానమైనది లేనేలేదు. అనఁగా ధనాశచే మానావమానంబుల విడనాడి పరుల గోజి యైహికలాభంబుల ననుభవించుటకంటె నీచమేదియునులేదని తా.

శ్లో॥ ప్రాదేశమాత్ర ముదరం పరిపూరయితుం క్రియా నయం యత్నః। చులుకేనాంభః పాతుం ఖనితవ్యః కిం తటాకోఽపి॥ ౭౬॥

తా॥ పక్వమైఁడన్నముతో పూడునట్టి పొట్టకుఁగాను లోకులు చేయు ప్రయత్నములుచూడ చేరెఁడు నీరు త్రాగుటకుగాను చెఱుపు త్రవ్వఁ బూని నవిధముగ నున్నవి.

శ్లో॥ యామార్ధ మసంస్కారాద్యాసుక్షయ మశనాచ్చ సువ్యక్తే। శారీరే సౌందర్యేఽభినివిశం తే కియన్మూఢాః॥

తా॥ దేహము యొక్కచక్కదనము ఒక్కజాము సేపునలుగులు పెట్టి తోమి కడుగక యున్న పోవుచున్నది. మఱియును రెండుజాములు అన్నము తినకున్న నా చక్కదనము పటాపంచలగుచున్నది. అది బాగుగఁదెలిసి యుం డియు దేహమునకు మెఱుఁగు లిడఁజూచు వారెంతటి మూఢులని చెప్ప వచ్చును. అనఁగా సహజమలినమయిన యీదేహమును పోషించిన నేమియు ప్రయోజనము లేగు, కావున నా దేహచింతమాని ముక్తినందఁ దగిన మార్గము నబయుట మంచిదని భావము.

## కామము.

శ్లో॥ వంధ్యేత్యాహు స్తరుణీం జరతీతి పరిత్యజంతి బహు పుత్రాం । అపి నిందంత్యల్పసుతాం కా గృహిణీ కామినాం హృద్యా॥ ౪౨॥

తా॥ కాముకులు తరుణిని (నడివయసునన్నస్త్రీని) గని వంధ్య (బిడ్డ లులేనిది) అనిదూషించుదురు. పెక్కండ్రుసుతులుఁగల దానినిచూచి ముసలిది

అని విడిచిపెట్టుచున్నారు. స్వల్పముగ బిడ్డలుగల దానినిసయితము నిందించుచునే యున్నారు. కామకుల కే యిల్లాలు మనోహరురాలో తెలిసినదికాదు. అనఁగా కామమునకు హద్దులేదు అని భావము.

శ్లో॥ యాంతిశుచ మకృతదారా ద్వేభార్యే నేతి కృతదారాః।
తే పరదారా నేతి స్త్రీభిస్త్రస్తా న్న పశ్యామః॥ ౪౯॥

తా॥ పెండ్లికానివారు నాకు పెండ్లికాకపోయెనేయని యేడ్చుచున్నారు. పెండ్లిచేసికొన్నవారు "నాకిద్దరు భార్యలులేకపోయిరే" యని యేడ్చుచున్నారు ఇద్దఱు ముగ్గురు భార్యలున్నవారు సయితము పరవనితరాకపోయెనే యని యేడ్చుచున్నారు. ఇదియంతయుఁ జూడ స్త్రీలచేఁ దృప్తినందినవారే లోకమున కనుపించుట లేదు.

శ్లో॥ మదనస్యాజ్ఞాకరణే మన్యే జగదఖిలమేక రూపమిదమ్।
తిర్యంచ ఇతి నరా ఇతి దేవా ఇత్యన్యతో భేదః॥ ౫౦॥

తా॥ ప్రపంచమునందలి ప్రాణికోటి తిర్యంచులు (పశుపక్షిమృగములు మొదలగునవి) మనుష్యులు, దేవతలు అని మువ్విధములుగానున్నను మదనవిలాసమునందు మాత్రము జగమంతయు నొక్క రూపముగనే యున్నదని తలఁచెదను. అనఁగా జ్ఞానశూన్యులయి కామసుఖంబుల నోలలాడువారికిని పశుపక్ష్యాదులకు నా విషయంబున నించుకేనియు భేదంబులేదని భావము.

శ్లో॥ శుక్లవిమోకస్థానం మలమూత్ర త్యాగదేశవత్కిమపి।
స్త్రియ ఇతివిధినావిహితం కియదత్రజనా నిమజ్జంతి॥ ౫౧॥

తా॥ మలమూత్రములవదలు స్థానములలాగున నొకటయిన శుక్లవిమోక స్థానము స్త్రీకి బ్రహ్మచే నిర్మింపఁబడెను. జనులందఱు దానియందుఁబడి కొట్టుకొనుచున్నారు. దీనికంతకు నజ్ఞానము కారణమని భావము.

శ్లో॥ వేదా నధీత్య విధివన్మీమాంసిత్వా తదర్థంచ ।
దారాఃకర్తవ్యా ఇతి కేనేదం ప్రహసనం కథితమ్॥ ౫౨॥

తా॥ వేదము నభ్యసించి వేదార్థ విచారణ చక్కఁగాఁ జేసియును వివాహము చేసికొనవలయునను ప్రహసనము (నవ్వుబాటు వాక్యము) ఎవఁడు చెప్పెనో తెలిసినదికాదు. అనఁగా వేదముల నధ్యయనముచేసి వేదార్థముల బాగుగఁ జర్చించిన వారు సయితే మాయజ్ఞానమున (కామమున) బడుట యెంతగ నున్నదని భావము.

శ్లో॥ దుఃఖేనోపార్జ్యంతే పాల్యంతే ప్రత్యహంచ లాల్యంతే ।
వామాస్త్రియోవిమూఢై రుపభుంజానాస్సుఖం ద్విగుణమ్

తా॥ రెట్టింపులు సుఖము ననుభవించుచున్న యందకత్తెలను మూఢమానవులు అనేక కష్టములుపడి సంపాదించుచున్నారు. అంతటితో నూఱక యుండక సదా జాగరూకులయి కాపాడుచున్నారు. మఱియును ప్రతి నిత్యమును బుజ్జగించుచున్నారు. దీని కంతకుఁ గారణము కామము అని భావము.

శ్లో॥ అశ్నీతపిబతఖాదత జాగృత సంవిశత చలత తిష్ఠతవా ।
సకృదపిచింతయతాంత స్త్వవధికో దేహ బంధఇతి॥ ౫౪॥

తా॥ ఎన్ని పర్యాయములు తిన్నను తినుఁడు. త్రాగినను త్రాగుఁడు సమలుఁడు, మేలుకొనుఁడు, ప్రవేశింపుఁడు, తిరుగుడు, ఉండుఁడు. ఇవెన్ని

చేసినను ఒక్కమాటయినను దేహ మశాశ్వతమనుమాట మనసున నెంచుఁడు. (ఇన్ని కార్యములును దేహమునకుఁ జేరినవేగాని వేఱుకాదు. ఇంతకష్టపడి దేహమును పోషించిన నెప్పుడో యొకప్పుడు నశించునదేకాని నిత్యముకాదు. కావున నివియన్నియు వ్యర్థములని భావము.

శ్లో॥ కింవిజితయాపృథివ్యా కింకాంచనభూభృతా కరస్థేన।
కిం దివ్యాభి స్త్రీభి ర్మర్త్య వ్యే బ్రహ్మణా లిఖితే॥ ౫౫॥

తా॥ దేహ మెన్నఁటికైన నశింపవలసినదే యని బ్రహ్మవ్రాసియుం డఁగా భూమి నంతయుజయించి రాజభోగముల ననుభవించిం ప్రయోజన మేమి? మేరువు నరచేతనుంచుకొన్న నేమి లాభము? ఇంద్రభోగము లను భవించిన లాభ మేమి? అశాశ్వతములయిన యీ సుఖములవలన లాభము లేదు అని భావము.

శ్లో॥ జీవతికతిచిన్నిమిషాన్కతి చిత్తేష్వశ్రుతీరధీత ఇవ।
తావ త్యేవాకలయతి తంత్రాణి నవాని చాతను తే॥ ౫౬॥

తా॥ మనుష్యుఁడు జీవించునదే యత్యల్పకాలము. అందులో గొన్ని నిమిష ములు వేదశాస్త్రములఁజదువుచున్నాఁడు. అంతలోనే సకల శాస్త్రములఁ గట్టి వాఁడగుచున్నాఁడు. అంతటితో నూఱకుండక, క్రొత్తక్రొత్త శాస్త్ర ములనుచేయుచున్నాఁడు. అనఁగా అనంతములయిన వేదశాస్త్రము లల్పాల్ప కాలము చదివినమాత్రమున వాని తత్వ మెఱుంగుట దుర్లభము. సంపూర్ణజ్ఞానము కలుగమిచే పెడ త్రోవలఁద్రొక్కి చెడిపోవుదురు.

శ్లో॥ స్వల్పో౽జీవనకాలః స్వల్పాధీః పరిచయస్స్వల్పః ।
తదపిత రేమకథంచి చ్ఛ్రితమోయది నోపజాయంతే॥

తా॥ మన కీలోకమున నాయువే బహు స్వల్పము. బుద్ధి యధికముగ నుండిన స్వల్పకాలమున నే జ్ఞానమును సంపాదింపనగు నన్నచో నా బుద్ధియునతి స్వల్పము. శాస్త్రాదులలో ప్రవేశమా యంతేకంటే స్వల్పము. బ్రహ్మజ్ఞాన బోధకములగు వేదము లేలేకున్న మనము తరించుటయెట్లు? తరింపలేకపోదుము.

## సంసారము.

శ్లో॥ కుతఆగతంనజానే క్వనువాగంతవ్య మిదపినజానే ।
సంచరసి క్వేదానీం సంసారపథే మహాతమసి॥ ౫౮॥

తా॥ ప్రతి మనుజుఁడును తానెచ్చటినుండి వచ్చినదియును, ఎక్కడికి పోవలసినదియును (తాను చేరవలసిన తావు) ఫలానిదనియును తెలిసికొనక. గాఢాంధకారమైన సంసారమను మార్గమునందు పడి చిక్కినతావే తిరుగు చున్నాఁడు. అని తాత్పర్యము.

శ్లో॥ తమసావృతాశ్చరంత స్సవిధేదూరేచ నావయంత్యర్థాన్ ।
అవయంతితు విస్పష్టంతదితి శిరస్యభిహ తేమూఢాః॥ ౫౯॥

తా॥ చీకటిలో త్రోవతప్పి యల్లాడుచు దూరమునగాని సమీపమున గాని యున్న వస్తువులఁ దెలిసికొనఁజాలక తలబొప్పికట్టి యెట్లు తెలిసికొను చున్నాఁడో, ఆలాగుననే అజ్ఞానాంధకారమున పడి యల్లాడు వాఁడును తన స్వరూపమును తెలియలేక చిట్ట చివరకు తలబొప్పి కట్టగాఁ గట్టగా (మొట్టి కాయలు తినఁగా దినఁగా) స్పష్టముగాఁ దెలిసికొనుచున్నాఁడు.

## స్వ ర్గ ము.

శ్లో॥ నిమిషంత్యత్ర తరుణ్యాత స్తత్ర తరుణ్యోనవనిమిషంతి।
ఈదృక్షోహి విశేషస్స్వర్గః స్వర్గఇతి కిం తత్ర॥ ౬౦॥

తా॥ అందఱును స్వర్గమునకుఁ బోవలెను స్వర్గ సుఖములననుభవింప వలయునని కోరుచుందురు భూలోకము నందలి స్త్రీలు కండ్లు మూయుచు తెఱచుచు నుందురు. స్వర్గమునందలి స్త్రీలు సదా తెఱచుకొనియే యుందురు. ఈవిశేష మేకాని యింతకమించి భూలోకమునసుండు స్త్రీలకంటె దేవతాస్త్రీలకే విశేషములును లేవు. అట్లుండ ననిత్యమైన యాస్వర్గసుఖమునకుగా జను లిట్లల్లాడుట వింతగనున్నది.

శ్లో॥ కోపోమైత్రావరుణే శ్శాపో వా తారికస్యమునేః।
సంస్మర్యతేయది సకృచ్ఛతోరపిమాస్తు శక్రపదమ్॥ ౬౧॥

తా॥ అగస్త్యమహర్షికి ఇంద్రునిపై వచ్చిన కోపముగాని, గౌతమ మహర్షి యింద్రునికిచ్చిన శాపముగాని, ఒక్క పర్యాయము జ్ఞప్తికివచ్చిన వాఁడు తన శత్రువునకు సయితమింద్రపదవి యక్కరలేదని మొరపెట్టును. అనఁగా నింద్ర పదమునందుకూడ సుఖమేమియు లేదు అని భావము. ఇచ్చట ఇంద్రపదము నందిన నహుషు నగస్త్య మహాముని "సర్పమవై యి మహారణ్యమున పడియుండుము,, అని శపించిన కథయును, అహల్యా జారుఁడయిన యింద్రుని గౌతముఁడు "సహస్ర యోనుఁడవు కమ్ము" అని శపించిన కథయును, భారత రామాయణములందలివి యను సంశయములు.

శ్లో॥ గచ్ఛత్వమరావత్యాంగచ్ఛతుచతురాననస్య వానగరే ।
పునరాగంతవ్యం యదిపుంసాకింసాధితం భవతి॥ ౬౨॥

తా॥ యజ్ఞ యాగాదు లాచరించి స్వర్గము, బ్రహ్మపట్టణము, సంపాదించినను "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి,, అను వచనముచేత కొంత కాలముగడచిన మఱల భూలోకమునకు రావలసినదేకాని యచ్చటనే సదా యుండుటకులేదు. కావున అశాశ్వతములయిన స్వర్గాదులవపేక్షించి ప్రయాస నందుట కంటె నిత్యమయిన ముక్తిని గోరుట మంచిదని భావము.

శ్లో॥ భుక్తాబహవోదారా లబ్ధాఃపుత్రాశ్చ పౌత్రాశ్చ ।
నీతంశతమప్యాయుః స్సత్యంవదమర్త్యమస్తిమనః॥ ౬౩॥

తా॥ ఎందఱిని వివాహముచేసికొని యెంత సుఖమనుభవించినను, ఎందఱు పుత్త్రులను కన్నను, ఎందఱు పౌత్త్రులను కన్నను నూఱేండ్లు సంపూర్ణముగ బ్రతికినను చావు తప్పనే తప్పదు. కావున మృత్యువునుండి తప్పించుకొనఁ జాలని యివి యన్నియు నిష్ఫలములని భావము.

శ్లో॥ విశ్లేషణస్వభావాన్విషయాన్పశ్యన్కరోతికోమమతామ్।
వశ్య దవస్థాపన్నం కఃక్రీణీతే ధనైరశ్వమ్॥ ౬౪॥

తా॥ విశ్లేషణ స్వభావము (చీలిపోవు స్వభావము)గల విషయముల యందు మమకారము నెవఁడు ఉంచును? బుద్ధిమంతుఁడెవఁడు నుంచఁడు. చావ సిద్ధముగనున్న గుఱ్ఱమును ధనమిచ్చి యెవఁడు కొనును? బుద్ధి మంతుఁ డయిన వాఁడు కొననే కొనఁడు. అనఁగా విషయాదులు వినశ్వరములు తాను

శాశ్వతుఁడు. ఈ రెంటికి నెన్నఁటికిని కలియనే కలియదు. ఎన్నటికైనను వేఱుకావలసినవే కావున నట్టి విషయాదులయందు బుద్ధిమంతుఁడు మమకారమును పెట్టఁడు. అని భావము.

శ్లో॥ అన్నాభావే మృత్యుశ్శాలిభిరన్నాని శాలయోవృష్ట్యా।
వృష్టిస్తపసేతి వదన్నమృత్యవే కత్త్ర పశ్చ్వరతు॥ ౬౫॥

తా॥ అన్నము లేకున్న మృత్యువు కలుగును. ఆయన్నము ధాన్యముల వల్లకలుగును, ఆధాన్యములు వర్షమున్ననే కానిపండవు. ఆవర్షము తపస్సుచేత కురియుచున్నది. ఇదియంతయు చెప్పుచుండి యాయన్నమునకుగానే తపస్సు చేయకపోతే చావు కలుగకుండుటకుగానే తపస్సు చేయుఁడు.

శ్లో॥ కింననిగృహ్ణంతిమనః కింనభజంతే జనాశ్శివంశరణం।
అభిసంధిభేద మాత్రాన్మోక్షోపాయేనబధ్యంతే॥ ౬౬॥

తా॥ జనులు మనసును విషయాదులయందు ప్రవేశింపనీయక కట్టివేయుచున్నారు. (జితేంద్రియులగుచున్నారు.) సదా యీశ్వరసేవచేయనే చేయుచున్నారు. అయినను అభిసంధిభేదము మాత్రమువలన. (సంగదోషమువలన) ముక్తులుకాక సంసారమగ్నులగుచున్నారు.

శ్లో॥ భోగాయపామరాణాం యోగాయవివేకినాంశరీరమిదమ్
భోగాయచయోగాయ చ నకల్పతేఽసర్విదగ్ధానామ్॥ ౬౭॥

తా॥ పామరులు దేహమును భోగములనుభవించుటకుగా పోషించుచున్నారు. జ్ఞానులు యోగము కొఱకు దేహమును బోషించుచున్నారు. రెండిటఁజెడినవారు (మూఢులును కాక జ్ఞానులును కాక యల్పజ్ఞానముచే విఱ్ఱవీగువారు) రెంటికి నుపయోగింపక వ్యర్థముగఁ బోషించుచున్నారని. భావము.

శ్లో॥ బ్రాహ్మణచండాలా ఇత్యాహమనుర్య స్మహాపథికాన్।
భవమార్గమహాపథికా సధి కృత్త్యైవ ప్రవృత్తం తత్ ॥

తా॥ ధర్మశాస్త్ర కర్తయగు మనువు మహాపథికులను (చెడ్డనడవడిక ల వారలను) బ్రాహ్మణ చండాలురని చెప్పెను. ఆమాట భవమార్గ మహాపథికులను (జన్మనొసఁగు సంసారమను దుర్మార్గములనవలంబించిన వారలను) గూర్చి చెప్పినదేకాని ఇతరులను గూర్చికాదని భావము.

శ్లో॥ ఏకద్వ్యాఽక్షితిపతిషు ద్విత్రా దేవేషు పంచషాద్రుహిణే।
ఏతావంతోఽజగతి బ్రహ్మానందార్ణవస్య కణాః॥ ౯౯॥

తా॥ ఈప్రపంచమునందు బ్రహ్మానంద సుఖ మెవ్వరికిగాని లేనేలేదు. ఒకవేళ యున్నప్పటికిని బ్రహ్మానందమను మహాసముద్రము నందలి యొకటి రెండు బొట్లు (కణములు) భూపతుల యందుండవచ్చును. దేవతలయందు మూఁడు నాల్గు కణములుండవచ్చును. బ్రహ్మయందు అయిదారు కణములుండవచ్చును. బ్రహ్మానంద సుఖము సంపూర్ణముగ బ్రహ్మాదులకు సయితము పూజ్యము (సున్న) కావున బ్రహ్మాదుల పదవిగోరుటకంటె ముక్తికలుగు మార్గ మఱయుట మంచిదని భావము.

శ్లో॥ అజ్ఞానే నాపిహితే విజ్ఞానే కర్మ కిం కురుతే।
పిక లేచక్షుషి తమసావ్యాదాయ ముఖంకి మేక్షేత॥ ౧౦౦॥

తా॥ చీకటిలో కండ్లు తెలియక పోయినప్పుడు ముఖమెత్తి చూచినను నేమియు కనుపడదు. ఆలాగుననే అజ్ఞానముచే విజ్ఞానము కప్పఁబడినపు డే సత్కార్యము చేయుటకును వీలుకాదు అని భావము.

## అల్ప జ్ఞానము.

శ్లో॥ అతికలుషమాశునశ్వరమాపాతస్ఫురణమనభిలాపకరమ్
అపిహ్రీయంతిజనాః కథమవలంబ్యజ్ఞానఖద్యోతమ్॥౭౧॥

తా॥ మిగుల కలుష మయినదియును, శీఘ్రముగ నశించు స్వభావము గలదియును, క్రిందపడు నంతవఱకుఁ గొంచెముగ (మిలుకు మిలుకు మని) ప్రకాశించునదియును, అనభిలాపకరమః (మాటలాడ నేరనిదియు) నగు జ్ఞానమను మిణుగురు పురువును (అల్పజ్ఞానమును) పెట్టుకొని జనులుతమకు మహాజ్ఞానమున్నట్లు ఏమోసంతసించు చున్నారు.

శ్లో॥ ప్రయుతంనియుతంవాపిప్రదిశంతిప్రాకృతాయభోగాయ।
క్రీణంతినబిల్వదళైః కైవల్యం పంచషైస్మూఢాః॥ ౭౨॥

తా॥ మూఢులు ప్రాకృత భోగములకుగాను లక్ష నదిలక్షలు రూపాయలు (అనఁగా లక్షల కొలదిధనము) నెలవుచేయు చున్నారుగాని అయిదారు బిల్వదలములచేత కైవల్యమును కొనఁజాలకున్నారు. అనఁగా లాభము లేని సంసారమునకుగా నెంతోద్రవ్యము నెలవుచేసి కష్టముల ననుభవించు చున్నారుకాని అయిదారు మారేడుదలములతో నీశ్వరు నారాధించి కైవల్యము నందఁ జాలకున్నారు. ఎంత వింత? అని భావము.

శ్లో॥ యావత్కాలచేష్టంతే తావత్పాశేన బధ్యతేగ్రంథిః।
నిభృతం యది వర్తంతే కాలేన స్రంసతే పాశః॥ 23॥

తా॥ త్రాడు ముడిపడినపుడా త్రాటిని లాగుచుంటిమేని ముడియంత కంతకు బిగిసికొని పోవునేకాని వీడదు. కదలింపక యుంటిమేని కొంత కాల

మునకు దానంతట నదియేవీడిపోవును. అనఁగా నెత్తిన జన్మము నెత్తనే యెత్తి తిమి. సంసారసుఖముల ననుభవించిన పిమ్మట విరక్తినందుదమనిన సాధ్యము కాదు. అంతకంత కధికమగును అని భావము.

శ్లో॥ ఉపరుంధంతి శ్వాసాన్మునయో నాశ్నంతి నపిబంతి ।
స్తూయంతేకింమునయః కంఠేకుర్వంతి కనకపాశమిమే॥

తా॥ మునులు శ్వాసములఁ బిగఁబట్టుచున్నారు (ప్రాణాయామమును పట్టుచున్నారు) కాని కూడుకుడిచి నీరానుటలేదు. మఱియును కనకపాశా దులను కంఠమునఁ దాల్చుటలేదు. అయినను వారెందుకెల్ల వారిచేఁ గొనియాడఁ బడుచున్నారు? వారేస్తుతింపఁ దగినవారుకాని యుదరపోషణ పరాయణులు స్తుతింపఁదగరని భావము.

శ్లో॥ కామంజనాఃస్మయంతే కైలాసవిలాస వర్ణనావసరే ।
సాధన కథనావసరే సాచీకుర్వంతి వక్త్రాణి॥ ౭౫॥

తా॥ కైలాసము నందలి విలాసముల వర్ణించునపుడు జనులు మిక్కిలి పొగడుచు నవ్వుదురు. ఆకైలాసమునకుఁ బోవుటకు సాధనములఁ జెప్పునపుడు మూతులు ముడుచుకొను చున్నారు. కైలాససుఖముల నందవలయునని యాశ యేకాని పోవుటకుఁ జేయఁదఁగిన సాధనములఁ జేయరు అని భావము.

శ్లో॥ వంగాఃకథమంగాః కథమిత్యనుయుంక్తే వృథా దేశాన్ ।
కీదృక్కృతాంతపురమితి కోపి నజిజ్ఞాసతేలోకః॥ ౭౬॥

తా॥ వంగదేశ మెట్లుండును? అంగదేశ మెట్లుండును? అనివ్యర్థముగా దేశములఁ జుట్టుదురేకాని యమపురి యెట్లుండునని విచారించిన వాఁడొక్క

డునులేఁడు. అనఁగా నేయేకార్యము లొనరించిన యనుభూతి జేయుదుము? అందేమి యను భవించుదుము? అని విచారించిన వాఁడొక్కఁడును లేఁడని భావము.

శ్లో॥ త్యక్తవ్యోమమకార స్త్యక్తుం యది శక్యతేనాసౌ ।
కర్తవ్యోమమకారః కింతుససర్వత్ర కర్తవ్యః॥ ౭౭॥

తా॥ నేను, నాదియను మమకారము విడుచుటకు శక్తిలేనప్పుడు సర్వ జంతువుల యందును మమకార ముంచవలసినదే కాని కొందఱియందు మమ కారమును కొందఱియందు ద్వేషమునుంచుట తగదని భావము

శ్లో॥ పుత్రాఇతిదారా ఇతిపోష్యాన్మోక్షో బహిర్జనాన్బ్రూతే।
అంధేతమసి నిమంజన్నాత్మా పోష్యఇతినావైతి॥ ౭౮॥

తా॥ మూర్ఖుఁడు (జ్ఞానహీనుఁడు) గాంఢాంధకారము నందు మునిఁ గినవాఁడై పెండ్లమనియును, బిడ్డలనియును తనకంటె నితరులయిన వారల పోషింపఁదగిన వారలగఁజెప్పుచు తాపత్రయమునందు చున్నాఁడేకాని ఆత్మ (తాను) పోషింపఁదగిన వాఁడన్నమాట నెఱుంగఁ జాలకున్నాఁడు

శ్లో॥ యచ్చింతిత మధిగర్భం యచ్చ చిరం చింతితంనరకే ।
విషయానిల సంసర్గాన్మమృజేత త్సర్వ మేకపదే॥ ౭౯॥

తా॥ గర్భమునందు మలమూత్రముల కూపమునఁబడి తన్నుకొను నపు డాలోచించిన యాలోచనలను, అంధతామిస్రాది నరకంబుల ననుభవించు కాలమున నాలోచించిన యాలోచనలును, శబ్దాదివిషయములును వాయువు నొక్కటియయిన తోడనే ఒక్కనిమిషములో మఱచి పోవుచున్నాఁడు.

అనఁగా నా నరకబాధల ననుభవించునప్పుడు ''ఇఁకమీఁద సత్కార్యము లొనరించి బ్రహ్మానందము నందనలయును కాని దుష్కార్యము లాచరింపఁగూడదు,, అను కొనుచున్నాఁడు కాని జన్మమెత్తిన పిమ్మట వానినన్నిఁటి మఱచిమఱల వానినే జేయుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ బాహ్యాగతాగత శీలా ప్రాణస్య శ్వాసలక్షణావృత్తిః ।
కర్షతిమనసోవృత్తిం కులటేవ కులస్త్రియంముగ్ధాం॥ ౧౦॥

తా॥ దేశ దిమ్మరియగు వ్యభిచారిణి పదిపర్యాయములు వచ్చుచుఁ బోవుచునుండి శుభమశుభము తెలియని కులాంగనను తనవృత్తికి (వ్యభిచారవృత్తికి) గొనిపోవులాగున ఉదరపోషణావృత్తి మనస్సును దుర్విషయముల కీడ్చుకొని పోవుచున్నది.

భ క్తి.

శ్లో॥ అతిగంభీరమనావిలమక్షోభ్యమదృష్టపారమవిలంఘ్యమ్
అవిరలతరంగ సంకులమైక్షిషివిజ్ఞానసాగరంమహాత్మామ్॥

తా॥ మిగుల గంభీరమును, స్వచ్ఛమును (కెలుకలు కానిదియును) అక్షోభ్యమును, అంతులేని యావలిగట్టు కలదియును, అగు మహాత్ముల విజ్ఞాన సాగరమును నేకనుగొంటిని అని భావము.

శ్లో॥ ఘోరంభవ మపహాతుం కతిచిదఘోరంభ నంప్రపద్యంతే
సంసరణకాతరాణాం సంసరణం శాంభవీభక్తిః॥౧౨॥

తా॥ కొందఱు భయంకరమైన జన్మమును తొలఁగించు కొనుటకు అఘోర స్వరూపుఁడయిన యీశ్వరుని సేవించుచున్నారు (పొందుచున్నారు) సంసారభీతి నందినవారలకు ఈశ్వరభక్తియే శరణమని భావము.

శ్లో॥ పాశో యది మోక్తవ్యః పశుపతిరేవానుసర్తవ్యః ।
నఖలు వ్యతిముచ్యంతే పశవః పాశేన సంబద్ధాః॥ ౮౩॥

తా॥ భవపాశమున కట్టఁబడిన పశువులు (జీవులు) ముక్తులు కావలయునన్న పశుపతియగు నీశ్వరు సేవింపవలయును. అతనిని సేవింపని వారు భవపాశముక్తులు కానేరరు అనిభావము.

శ్లో॥ అల మల మను భూతాభిర్మాతృభిరలమస్తు పితృభిశ్చ ।
భవితవ్యం యది నిత్యవదర్ధం మాతుః పితుశ్చాప్యస్తు॥ ౮౪

తా॥ ఇంతకు పూర్వమను భవించియున్న తల్లులును తండ్రులును చాలుటురు. అనఁగా నింతకుముందు పెక్కు జన్మము లెత్తి పెక్కండ్ర తల్లిదండ్రులని భావించినది చాలును. జన్మ మక్కర లేదని భావము. జన్మరహితుఁడయి నిత్యుని లాగుననుండఁ గోరువాఁడు సగముతల్లిని సగముతండ్రి నందినఁ జాలును. అనఁగా నర్ధనారీశ్వరుని సేవించినఁ జాలునని తాత్పర్యము.

శ్లో॥ ధన్యాస్తే బహుదేవాస్స్వామిని యేషాం నదుర్భిక్షమ్
జాతు న జానీమో వయమేకమపిస్వామినం పూర్ణం॥౮౫

తా॥ ఎవరికి దేవతల దరిద్రములేదో ఆపెక్కండ్రు దేవతలు గలవారు ధన్యులు,అనఁగా గొందఱు పెక్కు దేవతలఁ గొల్చుచురు కాని ఒక్క దేవుని యం

నను సంపూర్ణముగ భక్తినుంచరు. వారికేమికొదువ? ఈదేవుఁడు కాకున్న నింకొక దేవుఁడు దొరకును. మేముమాత్ర మీశ్వరు నొక్కనే పూర్ణముగ సేవించుదుమని తాత్పర్యము.

శ్లో॥ సంతుబృహాంతో గేవాఃకింతున తాన్నంతు మీహా తే చేతః
ఆఢ్యవదాన్యన్యాయాదంతకజత మేవ చింతయ తే॥౮౬॥

తా॥ అనేక పెద్దపెద్ద దేవతలుండిన నుండనిమ్ము. మాచిత్తము వారి నెన్నఁడు నమస్కరింప నెంచదు. ఆఢ్యవదాన్య న్యాయముచేత (ఎవనియొద్ద నేదియుండునో దానినే యాచకులకు వాఁడిచ్చును కాని తనయొద్దలేని దియ్యఁ జాలఁడు. అనుటయే ఆఢ్యవదాన్య న్యాయము) మృత్యుంజయునే సేవించు చున్నది. మృత్యువును జయించిన వానినే సేవించిన మృత్యువునలన భయముం డదు కాని యన్యుల సేవించిన మృత్యువు తొలంగదు. అనఁగా జననమరణ రాహిత్యమునుగోరు వాఁడీశ్వరునేసేవింపవలయునని భావము.

శ్లో॥ నిధ్యాయసివిషయసుఖంనధ్యాయసినిషమమస్యపరిపాకం
బంధుం తమేవచింతయ బంధ్ధుంమోక్షుంచయఃక్షమ తే॥

తా॥ విషయ సుఖమును గోరితివే కాని తదనంతరము దానివలన కలుగు బాధకమును యోజించిన వాఁడవుకావు. ఎవఁడు చెఱనిడుటకును, విడిచిపెట్టు టకును సమర్థుఁడో యతఁడే బంధువుగాని యన్యుఁడు బంధువు కాఁడని తలంపుము.

శ్లో॥ సదనం గురూప సదసంచరణంపంచాతురీపురశ్చరణం।
ధన సుభిలాప నిగోధన మంత్ర్యాశ్రమవాసినాం పుంసాం॥

తా॥ సన్న్యాసులకు గురూపదేశమే యిల్లు. పంచాక్షరీ మంత్రపు రశ్చరణమే కులము. కోరికెల విడనాడుటయే ధనము కాని తక్కిన కులసదన ధనములు వారికి లేవు.

శ్లో॥ సవిధిర్యత్తే విదధతి స ప్రతిషేధో యతోని వర్తంతే।
సోపనిషద్యద్బ్రూతే శైవాశ్రమవర్తినో ధీరాః॥ ౮౯॥

తా॥ శైవాశ్రమవర్తులగు పండితులు చేయునదేది కలదో యదే చేయందగినది. వారుదేనినుండి తొలంగుచున్నారో వానిని నిషేధింపవలయును. వారు చెప్పు వాక్యములే యుపనిషత్తులు.

ముక్తి

శ్లో॥ కా పితరౌ యౌ జగతాం కస్స్వామీ యః ప్రపంచస్య।
ప్రత్యస్తమితే భేదే తత్కిమిదం కిమితికః ప్రశ్నః॥ ౯౦॥

తా॥ తల్లిదండ్రులెవరు? ప్రపంచమున కంతకు నెవ్వరు తల్లిదండ్రులో వారే తల్లిదండ్రులు (అనఁగా పార్వతీ పరమేశ్వరులు జననీజనకులు) స్వామి యెవఁడు? ప్రపంచమున కంతకు నీశ్వరుఁడే స్వామి (అనఁగా నీశ్వరుఁడే మనకు స్వామియని భావము) నీవు నేనను భేదమే నశించి నపుడు (భేద శూన్యుఁడయి నపుడు) అదియేమి? ఇదియేమి, అను ప్రశ్నయే యుండదు. సర్వము తానేయయినందున (అనఁగా తనకంటె భిన్నమయినది లేనందున పై ప్రశ్న రానేరదు అని భావము).

శ్లో॥ త్యజ సంసార మసారం భజ శరణం పార్వతీరమణం।
విశ్వసిహి శ్రుతిశిఖరం విశ్వమిదం తవ నిదేశకరమ్॥

తా॥ సారములేని సంసారమును విడువుము. పార్వతీ మనోహరుని శరణు చొందుము. ఉపనిషత్తుల విశ్వసింపుము. (బ్రహ్మజ్ఞాన సంపన్నుఁడవు కమ్ము) ఈ ప్రపంచమంతయు నీయాజ్ఞ చొప్పున నడచుకొనును. అప్పుడు నీకు శత్రువేలేఁడు. అని భావము.

శ్లో॥ భవ్య మభవ్యం వా నః పరిలిఖతు వేధా స్సదుర్మేధాః
సవ్య మసవ్యం వా నశ్శరణం చరణం మహేశస్య॥

తా॥ బుద్ధిలేని బ్రహ్మదేవుఁడు లేక మహా దురాత్ముఁడైన బ్రహ్మదేవుఁడు మాకు జన్మకలిగించిననుసరి, జన్మరహితునిగఁ జేసిననుసరి, అదియునుంగాక మేముపోవు మార్గము సరియైనదైనను, సరికానిదైనను కానిమ్ము. మహేశ్వరుని పాదకమలమే మాకుశరణము. అనఁగా ఏదియెట్లైనను ఈశ్వరునే చిత్తమున నమ్మెదము.

శ్లో॥ వేధాః కథం హరిః కథ మితి ప్రశ్నేవయం మూకాః
శివ మేకం జానీమ స్తస్మా దన్యం న జానీమః॥ ౯3॥

తా॥ సర్వము శివమయమేకాని వేఱేమియు కాదని యనెదరేని బ్రహ్మ, విష్ణుః అను వారుగలరు గదా! వారెవరు? అను ప్రశ్నమమ్ము వేయ నక్కఱలేదు. ఆవిషయమున మేము మూగవారము. ఈశ్వరునే ముఖ్యముగా నెఱుగుదుము. ఆఈశ్వరుని కంటె నితరము మే మెఱుంగము.

శ్లో॥ దారుణ మసిపత్రవనం దారుణతమ మంధతామిస్రమ్
కావా తతః క్షతిర్నశ్శైవా వయ మాచతుర్వదనాత్॥

14

తా॥ భయంకరమయిన అసిపత్రవనము (అసిపత్రమను నరకము) వలన గాని, అంతకంటె దారుణమయిన అంధతామిస్ర నరకము వలనగాని మాకే మియు హానిలేదు. ఏలననఁగా మేము బ్రహ్మాదనుక శివభక్తులము. (శివభక్తుల నరకాదులేమియుఁ జేయఁజాలవని భావము.)

శ్లో॥ కృతదీక్షో ఘోర మఖే కులకూటస్థో భరద్వాజః ।
విద్యేశ్వరేషు కశ్చన పితామహో న ఇతి విస్రంభః॥౯౫॥

తా॥ మహా యజ్ఞములు చేయుటకు దీక్షవహించిన వాఁడును, (సదా యజ్ఞములుచేసిన వాఁడనుట) గోత్రఋషియును, విద్యేశ్వరులలో నొక్కఁడుగఁ బ్రసిద్ధిగాంచిన వాఁడునగు భరద్వాజ మహర్షి మాకు పితామహుఁడని మానమ్మకము. అట్టిమహాను భావుని వంశసంజాతుఁడనగు నేను సద్గతినందఁ బాత్రుఁడనని గ్రంథకర్త యభిప్రాయము. భరద్వాజ మహర్షి బహుయాగ ములు సల్పినట్లును, విద్యేశ్వరులలో నొక్కరయి నట్లును శ్రుతి ప్రమాణము లున్నవి.

శ్లో॥ కలహః కదాపిమాస్త్వితి కలితశరీరైక్యయోశ్శివయోః
అహ మస్మ్యహ మస్మీతి ప్రాప్తః కలహోమమత్రాణే॥

తా॥ పార్వతీ పరమేశ్వరు లిరువురును సదాతమకు జగడము లేకుండు టకుగాను అర్ధనారీశ్వర రూపమునుదాల్చిరి. (ప్రత్యేకముగనున్న యెడల నేను నీవు అనుభేదముచే జగడమువచ్చును, అభేదముగ నొక్కటిగ నున్న విరోధముకలుగదు. అని అవినాభావ సంబంధముగ నుండిరి) అట్లున్న వారలకిప్పుడు నా మూలమున (నన్నుకాపాడ వలయునను తలంపున) జగడము వచ్చెను.

అనఁగా నేకాపాడెదను, నేకాపాడెదను, అని యనసాగిరి. పార్వతీ పరమేశ్వరుల కిరువురకును భక్తుఁడ ననుభావమును గ్రంథకర్త తెలిపెను.

శ్లో॥ నరకాయాపిన భోగాన్నరాధ మాయాపినాన్యసురాణ్
మన్యంతే కతిచిదమీ మాహేశ్వర మాశ్రితాయోగం॥

తా॥ మాహేశ్వర యోగము నాశ్రయించిన కొందఱు (శివభక్తులు) భోగములను నరకము కంటెను తుచ్ఛముగఁ జూచుచున్నారు. మఱియును పరమశివుని కంటె నితరములగు దైవములను నరాధముల కంటె నలక్ష్యముగఁ దలంచుచున్నారు. అనఁగా నీశ్వరునే గొల్చి భోగంబుల దిగవిడిచి నిత్యముక్తులగు చున్నారని భావము.

శ్లో॥ జ్ఞాతుం హాతుం విషయం శ్రోతుంమంతుంగ్రహీతుమాత్మానమ్|వతాం యదినహిఘటతేతత్సాధయతా విముక్తాయ॥

తా॥ ఓబాలురారా? తత్త్వ విషయమును తెలిసికొనుటకును, శబ్దాది విషయసమితిని త్యజించుటకును, ఆత్మను (తన్ను) వినుటకును, గ్రహించుటకును సామర్థ్యము లేని యెడల కాశీపట్టణమునకు పయనమగుఁడు. అనగా తామున్న తావుననుండి జితేంద్రియులయి పరమాత్మ జ్ఞానమునంది శివైక్యమునందఁ జాలనివారు విశ్వనాథ పురంబగు కాశీపట్టణము నందు వశించిన ముక్తులగుదురు అని భావము

శ్లో॥ సాంఖ్యం యోగోనియమా భక్తిః కర్మప్రపత్తిరితి।
ఏకత్ర సకలమేత త్కేవల మవిముక్త మేకత్ర॥

తా॥ సాంఖ్యము (మోక్షసాధక మైనదియును, ఆత్మతత్త్వ విచారము గలదియును నగు శాస్త్రము) యోగము. (ఇంద్రియ జయమునకుగాఁ జేయు ప్రాణాయామాదికము) నియమము (వ్రతాచరణము) భక్తి, కర్మము (యజ్ఞాదు లొనర్చుట) ప్రపత్తియను నవన్నియును ముక్తినందువిషయమున నొకయెత్తు, కాశీపట్టణ వాసమొక్కటియు నొకయెత్తు. అనఁగా ముక్తినందుటకు రెండును సమాన మార్గములని భావము.

శ్లో॥ బద్ధః కస్తే వక్ష్యతి ముక్తో ముక్తిం న జానాతి ।
యాస్యసిచే దవిముక్తం జ్ఞాస్యసి విశ్వేశ్వరస్యముఖాత్ ॥

తా॥ ఎవఁడయినను ముక్తినందఁగోరి ముక్తి యెట్టిదని యడిగి నట్లయిన ముక్తుఁడు కాక మోహపాశ బద్ధుఁడయిన వాఁడు తనకే తెలియమిచే నొరులకుఁ జెప్పఁడు. ముక్తుఁడయిన వానినడిగిన ముక్తునకు ముక్తియను నది వేఱుగా లేమిం జేసి యతఁడును జెప్పుట దుస్సాధ్యము. కనుక ముక్తుని బద్ధుని యడిగియును లాభములేదు. కాశీపురంబున కేగినచో విశ్వేశ్వరస్వామి తానుగానే ముక్తిని తెలియఁ జేయఁగలఁడు. అనఁగా కాశీవాసులకు ముక్తి సర్వసిద్ధము. అని భావము.

శ్లో॥ నగ్రహీతం శ్రుతి హృదయం నచ నిగృహీతం పరిప్లవం హృదయమ్ । ఇచ్ఛామిచ ధామ పరం గచ్ఛామి చ విశ్వనాథపురిమ్॥ ౧౦౧॥

తా॥ నాకు వేదరహస్యము లేమియుఁ దెలియవు. మనసా విషయముల మీఁదికిఁ బరుగిడుచుండును గాని నిముసమయినను చంచలతను విడువదు. అయినను సర్వోత్కృష్ట మయిన పదమును (మోక్షమును) గోరుచున్నాను. కావున కాశీపురంబున కరుగుచున్నాఁడను. అని గ్రంథకర్త నుడివెను, దీనిచే వేదవేదార్థముల నెఱుంగకున్నను, మనసునిలుపఁ జాలకున్నను, ముముక్షువుగ నుండు వాఁడు విశ్వేశ్వరున కావాసంబయిన వారణాసియందు వసించు వాఁడు ముక్తినందునని తెలియుచున్నది.

ఇట్లు శ్రీమదప్పయ దీక్షితులవారి పౌత్రులగు

నీలకంఠ దీక్షితుల వారిచే విరచింపఁ

బడిన వైరాగ్య శతకము

తాత్పర్య సమేతము

సంపూర్ణము.

---

ఓమ్ తత్సత్.

